# మెట్రిక్ పద్ధతి

## తూనికలు, కొలతలు అమలు



ఈనాడు దేశమంతటికీ వర్తించే ఒకే విధమైన తూకాలు, కొలతల పద్ధతి మనకు లేదు. వివిధ ప్రాంతాలలో సుమారుగా 143 వివిధ పద్ధతులు అమలులో వున్నాయి. ఇన్ని పద్ధతులు వుండడం వలన, తూకాలలో ఎన్నో తకరాలు జరుగుతున్నాయి. ఇలాగు కాక, మెట్రిక్ తూనికలు, కొలతల పద్ధతి దేశమంతటిలోనూ అమలులోనికి వస్తే, దశాంశ పద్ధతి మారకం దృష్ట్యా, మనకు లెక్కలు కట్టడం బహు తేలిక అవుతుంది; అన్ని విధాలా సౌకర్యంగా వుంటుంది. తూనికలు, కొలతల ప్రమాణీకరణ చట్టం (1956) ప్రకారం మెట్రిక్ పద్ధతిలో మూల ప్రమాణాలు నిర్ణయింపబడ్డాయి. ప్రజలకు ఏ విధమైన ఇబ్బంది, అసౌకర్యమూ లేకుండా ఈ పద్ధతి క్రమంగా అమలుపరుస్తారు.

ఈ పద్ధతి ప్రవేశపెట్టబడిన ప్రాంతాలలోనూ, వ్యాపారాలలోనూ ఆ తరువాతకూడా పాత పద్ధతి తూనికలు, కొలతలు మరి మూడేళ్లపాటు వాడుకోనిస్తారు

**1958 అక్టోబరునుండి**
**మెట్రిక్ పద్ధతి**
**తూనికలు కొలతలు**
**ప్రవేశపెడతారు**

మెట్రిక్
తూనికలు
తెలుసుకోండి



తూకంలో ప్రమాణం
కిలోగ్రాం = (3[illegible] సేర్లు — 1 సేరు = 24 తులాలు)
లేక 2 పౌన్లు 3 ఔన్సులు

చిన్న ప్రమాణాలు

| | | |
|---|---|---|
| 10 మిల్లీగ్రాములు | = | 1 సెంటీగ్రాము |
| 10 సెంటీగ్రాములు | = | 1 డెసిగ్రాము |
| 10 డెసిగ్రాములు | = | 1 గ్రాము |
| 10 గ్రాములు | = | 1 డెకాగ్రాము |
| 10 డెకాగ్రాములు | = | 1 హెక్టోగ్రాము |
| 10 హెక్టోగ్రాములు | = | 1 కిలోగ్రాము |

పెద్ద ప్రమాణాలు

| | | |
|---|---|---|
| 100 కిలోగ్రాములు | = | 1 క్వింటల్ |
| 10 క్వింటల్స్ లేక 1000 కిలోగ్రాములు | = | 1 మెట్రిక్ టన్ను |

1

DA 57/240

భారత ప్రభుత్వంవారిచే జారీచేయబడినది




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏ మాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతేయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యస్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] జూన్ 1958 [సంచిక ౬.

# విషయసూచిక



ముఖచిత్రం :
జమినీవారి 'విజయకోటవీరుడు' చిత్రంలో వైజయంతిమాల



---



రాజస్థాన్ — ఉదయపూర్‌లోని భారతీయ లోక్ కళామండల్ వారు 'ఇంద్రపూజ' అనే నృత్య నాటకాన్ని ప్రదర్శించిన సందర్భమున అందులోని ఒక సన్నివేశము




జయజయ గృహలక్ష్మీ శ్రీ సతి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# కుల విచక్షణ — వర్ణాంతర వివాహములు



కులతత్వముల నిర్మూలించి యావద్భారత ప్రజానీకాన్ని సంఘటిత పరచుటకు వర్ణాంతర వివాహములు ఉత్తమ మార్గమనియు, కాంగ్రెస్ సంస్థ వర్ణాంతరవివాహములను ప్రోత్సహించునట్లుగా చేసిన తీర్మానములో క్రొత్త ఏమిలేకపోయినా వర్ణాంతర వివాహము లమలుజరిగిన నో మాత్రము సాంఘికరంగమందు రాగల పరిణామాలు జాతీయ శ్రేయస్సుకు తోడ్పడవచ్చును.

వర్ణాంతర వివాహములు ఎల్లప్పుడు ఉత్తమ ఆశయ, లక్ష్యాలనుద్దేశించు నవిగానుండాలి. ముఖ్యంగా ప్రజలలో పరస్పర సహకార సద్భావములు, ఉత్తమసంస్కృతి, మెరుగైన నైతిక స్థాయి పెంపొందుటకు యీ వర్ణాంతర వివాహములు తోడ్పడాలి.

అగ్రకులాల మనుకునేవారు, తక్కువ కులాలవారు వివాహసంబంధాలు చేసికునే ముందు తమ గతచరిత్రను మరచిపోయి పరస్పర సానుభూతితో తమ తమ లోటుపాట్లను సరిదిద్దుకొని మెరుగైన మార్గాన జీవయాత్రకుపక్రమించాలి. అందుకు తోడ్పడలేని వర్ణాంతర వివాహం అపేక్షించతగినది కాదు.

భార్య, భర్తలు ఎవరేకులమువారైనా ఎవరిలో మంచి నడత, విద్యావిజ్ఞానములు, సంస్కృతియుంటే వారిని మరొకరు అనుసరించి సంసారజీవయాత్రను, సంఘజీవితాన్ని సుఖసౌభాగ్యాలతో గడుపగలరు. అలాకాకుండా తాత్కాలిక ఉద్రేకాలతోనో, లేక స్వార్థ మమకారములతోనో వర్ణాంతరవివాహములను చేసికొని భార్యా భర్తలిరువురు సంకుచితులుగా ఒకరినొకరు అర్థంచేసికొనుటగాని, ఒకరిలోని మంచిని మరొకరు అర్థముచేసికొని అనుసరించుటకాని, ఇరువురుకలసి మెరుగైన జీవయాత్ర లక్ష్యముగా నెంచుటకాని లేకున్నచో వర్ణాంతర వివాహముల లక్ష్యము సిద్ధించినట్లు కానేరదు.

గాంధీజీ నాయకత్వములో కాంగ్రెస్, వర్ణాంతర వివాహములను కులతత్వాల నశింపునుద్దేశించియే ప్రోత్సహించినది. వివాహమునకుముందు, వివాహానంతరము కుల విచక్షణను పూర్తిగామరచి తాము కులప్రసక్తిలేని భారతజాతికి చెందినవారమని భావించువారికే వర్ణాంతరవివాహములు. వర్ణాంతరవివాహముల అనంతరము సయితము కులతత్వాలను పట్టుకొని ప్రాకులాడటం స్త్రీ పురుషులిరువురు ఆత్మద్రోహంగా నెంచవలసియుండును.

వర్ణాంతరవివాహములు దేశంలోని అనేకకులాల మధ్యగల ద్వేషాన్ని, అనైక్యతను, అధికార ఆధిపత్యవాంఛలను నిర్మూలించుటకు యావద్భారత ప్రజానీకం ఏకకుటుంబంగా విద్యావిజ్ఞానములతో ఆదర్శనీయమైన జీవితమును గడుపుచు జాతీయ సౌభాగ్యమునకు తోడ్పడునవిగానుండుట వాంఛనీయము.

—(o)—

# చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం

చిన్నమొత్తాల పొదుపు ఉద్యమం జాతీయశ్రేయస్సుకు అనేకవిధాల ఉపయోగపడగలదు.

ఆదాయం కొద్దిఅయినా, గొప్పఅయినా అవసరానవసరములను గుర్తించి చిన్నమొత్తములను పొదుపుచేసి జాతీయప్రణాళికల నిర్వహణకు పెట్టుబడి పెట్టుట వలన అభివృద్ధి అభ్యుదయాలు మరింత సుగమంకావాలి.

ముఖ్యంగా స్త్రీలు కుటుంబాలలోని దుబారాను అరికట్టి పొదుపుచేయుడానికి అవకాశములు అనేకము. అలాపొదుపుచేసిన మొత్తాలను అనవసర ఖర్చులకు వినియోగించకుండా తమ భవిష్యత్ పురోభివృద్ధి, ఆర్థికస్థిమితము నుద్దేశించి అభివృద్ధి ప్రణాళికల నిర్వహణకు పెట్టుబడి పెట్టినచో తమ వ్యక్తిగత భవిష్యత్ సౌభాగ్యముతోబాటు జాతీయసౌభాగ్యమును త్వరితగతిన రూపొందచేయకలుగుచున్నారు.

కూలి, నాలి చేసికునేవారు, కొద్దిపాటి నెలజీతాలవారు సయితం అవకాశమున్నంతవరకు అనవసరఖర్చులను మానుకొని, చిన్నమొత్తాలను ప్రభుత్వముదగ్గర నిల్వచేసికొనుటవలన భవిష్యత్తులో నది వారి ఆర్థిక సౌష్టవమునకు, అవసరాలకు వినియోగపడగలదు.

చిన్నమొత్తాల పొదుపు ఉద్యమం ప్రతియొక్కరిలోను జాతీయి అభివృద్ధి అభ్యుదయాల పట్లగల భాధ్యతను పూరిస్తూ గర్వకారణమగుచున్నది కూడాను.

---



# కామాయని

మూలం : శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ : శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

(గతసంచిక తరువాయి)

శ్రద్ధ, లజ్జయొక్క ప్రసంగమునువిని మరల నిట్లు పృచ్ఛచేసెను. "మంచిది మంగళమయీ, నన్నను గ్రహించి నా జీవనయాత్రకొక శ్రేష్ఠతమమైన పదము నెరింగించి ధన్యనొనర్తువా? నా జీవనమొక దారి తెన్ను తెలియని కారుచీకటి. ఆ యంధకార మధ్యమున నొక కాంతిరేఖను దర్శించి పుణ్యము కట్టుకొందువా? నా మనమేల నిరంతము దుర్బలమై, నా నేత్రము లతిశీఘ్రముగా భాష్పకలితములగుచున్నవి? నా జీవన సర్వస్వమును పూర్ణవిశ్వాసముతో పురుషుని కర్పణమొనర్చి తద్విశ్వాస మహావృక్షచ్ఛాయలందు విశ్రమింపవలెనను మమత సదా నా హృదయమందేల జాగృతమగుచున్నది? ఎంత విచిత్రమైనదీయాత్మ సమర్పణ! దీనియం దెటుచూచినను త్యాగమే కాని ప్రతిఫలాపేక్ష కానరాకున్నదే."

"అంతయునువిని లజ్జ యిట్లనెను. "ఓ నారీరత్నమా! అశ్రుధారలతో జీవిత సర్వస్వమును ధారపోసి పురుషునికై సర్వవాంఛలను త్యాగమొనర్చితివి! నీవు శ్రద్ధవు! సాక్షాత్ 'శ్రద్ధ'యే నీ రూపమున శరీరధారణ మొనర్చినది. విశ్వాసమను రజిత శిఖరమున నుత్పన్నమై జీవితమను సుందర సమతల శాద్వలముల సదా ప్రవహించు యమృతఝరివి నీవు! మానవహృదయాన, ఆదికాలమునుండియు, మంచి యూహలకును, చెడ్డ యూహలకును సంఘర్షణ జరుగుచునేయున్నది. ఆ హేతువుననే నరుని మనము సదా యశాంతముగ నున్నది. నీవు సుందర సుఖద మందహాసములతో క్షుబ్ధహృదయమునకు శాంతి ప్రదాన మొనర్పవలసియున్నది" అని స్పష్టము సందేశించి 'లజ్జ' తన స్వరూపముద్రను శ్రద్ధపైనిడి యాకాశగామి యయ్యెను!

## అకర్మ

మనువుయొక్క శ్రవణపుటములందు కాముని ధ్వని నిరంతరము గింగురుపెట్టుచుండెను. ఆతడు సోమరసపానమునం దత్యంతలాలసుడై కర్మమార్గమును స్వీకరించి, యజ్ఞమొనర్ప కృతనిశ్చయుడై యుండెను. యజ్ఞకర్మముననే స్వప్నగోచరమైన స్వర్గము ప్రాప్తమగుననియు; కర్మవనముననే స్వప్నగోచరమైన, మనోమయమైన యాశాపుష్పము వికసించుననియు, నాతని ప్రగాఢ విశ్వాసము. ఆతనికి యజ్ఞము చేయవలెనని ఎంతటి గాఢవాంఛయున్నను అందులకు పురోహితులెవ్వరును కానరాకుండిరి. ఇది యజ్ఞమునకొక యవరోధము.

జలప్రళయమునుండి సజీవులై బయటపడిన 'కిలాతుడు' 'ఆకులి' అను నిద్దరసుర పురోహితులు లోకమంతటను పరిభ్రమించుచు, కడకు మనువు నివాసస్థలమునకు చేరిరి. అచటి పశువులను చూచుటతోడనే వారికి నోరూరినది. మనువు యజ్ఞమొనర్పవలెనను సంకల్పముతో నుండుటరసి, ఉపయుక్తమైన సమయమున నాతనిని సమీపించి యతనితో నిట్లనిరి. "మనూ, పురోహితుడు లేడని నీ వేల విచారించుచుంటివి? నీకు మేమే పురోహితులమై నీ యజ్ఞమును జయప్రద మొనర్తుము. వేవేగ నీవావసకుండమును సరిచేసి యగ్నిని రాజబెట్టుము. నీవాశించు సమస్త జీవన సుఖములును చేకూరుటకును, నిర్జనతయందలి నిరుత్సాహము నశించుటకును నీ కర్మయజ్ఞమే సాధనము. నీ హృదయరాజ్ఞియైన శ్రద్ధాదేవికికూడ నీ యజ్ఞము నూతనానందమును కలుగజేయును. నీవు గమనించితివో లేదో కాని, ఆమెకూడ ప్రకృతివోలె

నిత్యనూతనత్వమును వాంఛించుచున్నది. నూతనతా లబ్ధమైన యామె మనసును రంజింపజేయుటకైన త్వరితముగా యజ్ఞసన్నద్ధుడవుకమ్ము.

ఆకులి, కిలాతుడు మనువుచే నొక యజ్ఞమును చేయించిరి. ఆ యజ్ఞమునందు బలియొనర్పబడిన పశువుల యెముకలు గుట్టలై పడియుండెను. గుహయంతయును పశువుల రక్తపు మరకలచే నిండియుండెను. ఆ దృశ్యములు శ్రద్ధాదేవి హృదయమును కలవరపరిచెను. ఎవరి సంతసము నపేక్షించి మనువు యజ్ఞమొనర్చెనో - అట్టి తన ప్రియురాలగు శ్రద్ధ సంతసమందలేదు సరికదా, యజ్ఞమున జరిగిన భీషణహింసను, విశేషించి, మనువుయొక్క హింసాప్రవృత్తికిని మిగుల వగనొందెను. శ్రద్ధ ఏల వగచుచున్నదో మనువున కర్థముకాలేదు. అతడట్టులే సంశయగ్రస్తుడై యున్నక, సోమరసమును కడుపారగ్రోలి మదోన్మత్తుడయ్యెను. అంతట రాత్రియై, యంధకారము పృథ్వీమండలము నాక్రమించెను. ఆకసమున శశాంకు డుదయించెను.

శ్రద్ధాదేవి శయన గృహమున ప్రవేశించి, వెలుగుచున్న రెండు కాష్ఠముల చెంగట నున్నితమైన చర్మవసనమును పరచికొని దీర్ఘయాత్రానంతరము విశ్రాంతినొందు పథికునివలె పరుండెను. ఆమె హృదయ పూర్తిగ వాంఛించిన మనువు హింసాపంకమగ్నుడౌటకు చింతింపసాగినది. ఆమె యాశలను భిన్నమైన ప్రియుని ప్రవర్తనవలన నామె నేత్రములందు వివశత తాండవమాడినది. ప్రాణి కితర ప్రాణులయెడ నేల యింతటి నిర్దయ? జీవి మరియొక జీవి నేడ్పించి తానేల నవ్వజూచును? ఈ దుర్భర వ్యవహారమంతమొందుట కుపాయము లేదా?

ఇటు మనువు సోమరసపానమత్తుడై యుండగా, నాతని యందలి 'వాసన' ప్రచండరూపము ధరించినది. అతడు శ్రద్ధాదేవి యపూర్వ సౌందర్యములచే గాఢముగ నాకర్షింపబడి యామెను సమీపించినాడు. ఆ పూర్ణిమా నిశీథ సమయాన, శ్రద్ధయొక్క ముఖచంద్రకాంతుల కుప్పొంగుచున్న సముద్రమో యనునట్లామె వక్షస్థల ముచ్ఛ్వాసనిశ్వాసములచే కల్లోలమునందుచున్నది. ఆమె వక్షోజముల మధ్య నాలింగనా సౌఖ్య తరంగములు వెల్లువెత్తుచున్నవి. అట్టితఱి మనువు శ్రద్ధను స్పృశించెను. తోడనే యువతిని శరీరము పులకితమై అతనియందలి వాసనా విశేషము సంపూర్ణముగ విజృంభించగా శ్రద్ధతో నిట్లు భాషింప మొదలిడెను.

"ఓ శ్రద్ధా, నీ యతీత సుందర రక్తిమచే నా మనస్సునకు శాంతి ప్రదానమొనర్ప వేడుకొనుచున్నాను. చూడుము, మన యేకాంతమున కాటంకముగా నిలువక చందమామ మబ్బులలో దాగినాడు. ఇప్పుడు భూమ్యాకాశముల నడుమ మన మిరువురమే మేలుకొనియున్నాము. ప్రేయసీ, ఈ సమస్త విశ్వమును మనము సుఖోపభోగముల తేలియాడుటకే నిర్మింపబడినది. త్వరితముగ సోమరస పాత్రికను నీయరుణాధరముల కందింపుము. నీవును నేనును ఆనందడోలికల నూగులాడుటకై జాగుచేయకుము ... రమ్ము" శ్రద్ధ మనువువంక సంకోచముతో చూచుచు నిట్లనెను. "ఏమి నేడు మీ హృదయము కడు విచిత్రముగ మారినదే! మరు ప్రళయమే సంభవించినచో మరి నేనెవ్వతెను సహచారిణిగా నొనర్చుకొని జన్మమొనగుదువో? మఱల నేనిరపరాధ పశువును బలియొనర్తువో? హే ప్రియదేవా! పశువులకు జీవించు నధికారము లేదా? ఈ భీషణహింస నాధార మొనర్చుకొనియేనా నీవు నవీనసృష్టిని ప్రారంభించునది? స్వార్థసాధన మొక్కటేనా మన ఏకైక ధ్యేయము-"

మనువు: "శ్రద్ధా, స్వార్థమొక తుచ్ఛవస్తువు కాదు. జీవనము క్షణభంగురము. ఇందు మన మనుభవించుటకేదైన యున్నదన్నచో, అది స్వార్థమొక్కటేగదా! దానినికూడ మనమేల కోలుపోవలెను? ధర్మపన్నములనువీడి, నేనొనర్చిన జీవహింసకికై తపించుట మానుము."

శ్రద్ధ: "దేవా, సుఖమునకై స్వార్థమను మాటను నేనును అంగీకరింతును. కాని సర్వ సౌఖ్యములను తనయందే సంచిత మొనర్చికొన్నచో జీవులెట్లు వికాసమునందును? ఇతరుల నానందపరచి నీవానందించవలెను. ఇతరులకు సౌఖ్యప్రదానమొనర్చి తత్ప్రతిదానమున నధికతర సౌఖ్యమును పొందుచు, స్వసౌఖ్యముయొక్క పరిధిని విస్తృతమొనర్చుకొనుట మేలుకదా! ఏ సౌఖ్యము సర్వుల సౌఖ్యమగునో అదియే సత్యమైన సుఖమగునని విశ్వసింపుము-"

(సశేషము)

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డెసయింట్ - ఎక్సుపెరీ

ఆంధ్రానుకరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ

## సహారా ఎడారిలో అబ్బాయిని కలుసుకునే భాగ్యం

(ఏప్రిల్ సంచిక తరువాయి)

నా యీ కొత్త జీవిత యాత్రలో, ఆకాశ విమానాన్ని నడిపించుకుంటూ ఎన్నెన్నో దేశాలను చుట్టివచ్చాను. ఎంతెంత మందినో కలుసుకున్నా. కాని వాళ్లలో ఎవళ్లూ నా మనోభిప్రాయాలను, వాటి మూలాన నాలో అస్తమానమూ రేకెత్తుతూవున్న సమస్యలను తెల్పటానికి ఏ విధంగా సహాయపడినవాళ్లు లేరు. అంచేత నా జీవితం ఒంటరి జీవితం అనే చెప్పవచ్చు. ఆ రేళ్లు ఇలా గబ గబ దొర్లి పోయాయి. అటు తరువాత కొంతకాలం ఆఫ్రికా ఎడారుల్లో అడవుల్లో పనిచేయటానికి నా విమానాన్ని తీసుకుని వెళ్లాలసి వచ్చింది. అందులో సహారా ఎడారి ప్రాంతంలో విమానాన్ని నడపటమంటే సామాన్యమైన పనా? దోవలో ఏ యంత్రం చెడిపోయినా, విమానం సంగతి అటుంచి పైలట్ ఎదుర్కో-వలసిన కష్ట నిష్టూరాలు ఇన్ని అన్ని అని చెప్పటం అవసరం లేదుగా. అలాటిఅవస్థే నాకు సహారా ఎడారి మీదుగా వెడుతూ వుంటే సంభవించింది. చెడిపోయింది విమానపు మోటారు. విమానంలో ప్రయాణీకులు ఎవళ్ళూ లేరు. ఎప్పుడూ నా వెంట మెకానిక్‌ని తీసుకుని వెళ్ళడం పరిపాటి. కాని ఈ ప్రయాణంలో అటువంటి మెకానిక్‌ని తీసుకుని వెళ్ళటానికి అదృష్టం దొరికింది కాదు. ఇక ఏం చెయ్యాలి. నట్ట ఎడారిలో విమానాన్ని నేలమీదికి దించేయాలసి వచ్చింది. మోటరులో ఏం చెడిపోయిందో తెలుసుకొనటానికి గంటల పర్యంతం ప్రయత్నం చేశాను. ఎలాగయితేనేం, ఏ భాగం చెడిపోయిందో పసికట్టాను. ఇక దానిని రిపేరు చేయటం ఎలా? నా దగ్గరవున్న పనిముట్లు అంత చెప్పుకోతగ్గవి కావు. అవి ఈ పనికి ఏ మాత్రం వుపయోగపడేవి కావు. ఇక విమానాన్ని కదలించటం ఎలా? కదలించలేకపోతే అక్కడే వుండిపోవాలి. ఆ పరిసరాలన్నీ నాకు కొత్తవి. వాటిని అవగాహనం చేసుకోటానికి విమానాన్ని అక్కడే వదిలేసి వెళ్ళి వస్తేనో? అప్పటికే చీకటి పడుతూవుంది. ఆ చీకట్లో ఎలా వెళ్ళ గలుగుతాను? వెళ్ళినా దోవ తెలుసుకోటం ఎలా? ఇక తిరిగి అక్కడికి చేరుకోటమో! ఇవే నన్నా దుర్భరావస్థలో పీల్చి పిప్పి చేస్తూ వున్న సమస్యలు. వాటికన్న అతిముఖ్య

మైంది తాగటానికి నీరు. నా పాత్రలో వున్న జలం ఒకరోజుకన్నా సరిపోయేటట్లు లేదు. నీరు అయిపోతే ఇక బ్రతకటం ఎలా? .....

చావు బ్రతుకుల మధ్య వూగులాడుతూ వున్నాను, అలా ఒంటరిగా ఆ ఎడారిమధ్య వుండిపోయాయి. ఆ రోజు రాత్రి ఆరు బయట ఇసకలోనే నిద్రపోవాలసి వచ్చింది. అలసి సొలసి వున్నాను. అయినా నిద్ర వస్తేనా! ఆ చీకట్లో నలు ప్రక్కల ఎంత చూసినా లాభం వుంటేనా. అంతా నిశ్శబ్దం. అటువంటి నిశ్శబ్దాన్ని గురించి పుస్తకాల్లో చదివానుగాని, దాని మధ్య వుండిపోవటం నా జీవితంలో ఇదే మొదటి సారి. ఎన్నెన్ని వూహాలు ఆ సమయాన నా బుఱ్ఱలో రేకెత్తిపోతూ వున్నాయి! అవి నన్ను పెడుతూవున్న యాతనలకి ఇక అంతూ తంతూ అనేది వుంటేగా!

అంతా ఏడారి ప్రదేశం. ఎన్ని వందల మైళ్లు నడిచినా ఇసక. చెప్పరానంత ఇసక. నర పురుగు అనేది వుండే ప్రదేశం నేనున్న చోటికి ఎన్ని వందలమైళ్ల దూరంలో వుందో ఎవళ్లకు తెలుసు? నడిసముద్రంలో చెడిపోయిన నావ, దరీ దాపూ తెలియకుండా తికమక పడుతూవున్నట్లువుంది ఈ దుర్భరావస్థలో నా జీవితంకూడా.

ఇలాటి అయోమయావస్థలో ఆ రాత్రిని ఎలా గడిపానో - ఆ సంగతి ఇప్పుడు తలుస్తూవుంటే ఆశ్చర్యం వేస్తున్నది.

తెల్లవారుతూవుంది. ఎవళ్ళో నన్ను లేపుతూవున్నట్లు సందడి అవుతున్నది.

"నా కొక్క బొమ్మను గీసి ఇయ్యవూ? .... "

అది మనుష్యులకంఠస్వరమే! ఆ సందడికి హడలి పోతూ, చప్పున పడున్నచోటి నుంచి లేచి కూచున్నాను. కళ్లు నులుముకుంటూ అటుకేసి ఆశ్చర్య, విభ్రాంతులతో చూడసాగాను. నన్ను పిలుస్తూవుంది ఒక అబ్బాయి ఎంత ముద్దుగా వున్నాడు. ఆ అబ్బాయి! అలాటి విగ్రహాలని సుప్రసిద్ధ చిత్రకారు గీసిన చిత్రాల్లో, శిల్పులు చెక్కిన ప్రతిమల్లో మాత్రం చూశాను. అలాటివాళ్లు మానవజాతిలో పుట్టటం అపూర్వం, అసదృశ్యం అని అనుకుంటూ వుండేవాణ్ణి......కాని ఇప్పుడు ఈ ఎడారి మధ్యని నా యీ అయోమయావస్థలో, అలాటి పిల్లవాడు నా దగ్గర ప్రత్యక్షమవటం అంత చనువు దీసుకుని, నన్ను లేపటం, చప్పున ఒక బొమ్మను గీసి ఇయ్యమని మారాం చేయటం......నా కళ్ళతో నమ్మవచ్చా. ఇలాటి సంఘటనలు ఏకాకుల జన్మలో జరుగుతూ వుంటాయా?.... ....

II

అబ్బాయి కేసి ఎగాదిగా చూడటానికి మొదలెట్టాను. వాడు మరొకసారి "నా బొమ్మనుగీసి యియ్యాలి మేక బొమ్మని, చప్పున గీసి ఇచ్చేసేయి" ముద్దు ముద్దు మాటలతో అడిగాడు.

ఆ ముద్దు మాటలని వింటూ మురిసి పోతున్నాను. నిన్నటి నా అవస్థ, రాత్రి పూట నేనుపడ్డ యాతనలు... అన్నీ మర పిస్తూ వున్నాయి వాడి మాటలని వింటూ వుంటే. వాడి విగ్రహాన్ని తదేక దృష్టితో చూస్తేవుంటే వయస్సు ఆరేళ్ళకన్న ఎక్కువ వుండదు. అంత చిన్న పిల్లవాడు ఎలా వచ్చాడు? ఎక్కడినుంచి రావటం? అధవా ఆ ప్రాంతాలకు సంబంధించిన గ్రామాల్లోని వాడయితే వందలకొలది మైళ్ల దూరం నున్న వాటినుంచి ఎలా రాగలుగుతాడు? వాడికితోడుగా ఎవళ్ళూ లేరు కూడా. ఇంక ఎక్కడినుంచి ఈ నట్ట ఎడారిలో వూడి పడినట్లు! .. ఆ ప్రాంతాలవాళ్ల భాష ఒక ఎత్తు, మా ప్రాంతాల వాళ్ల భాష ఒక ఎత్తు. దానికీ దీనికీ ఎలాటి సంబంధం లేదనిగా మన పెద్దలు చెపుతూ వుండేది. ఈ ప్రాంతాల్లో ఈ ఆరేళ్లనుంచి ప్రయాణం చేస్తూవున్న నాకూ ఇది అనుభవవేద్య మేగా! కాని యీ అబ్బాయి అడుగుతూ వున్నదంతా నాకు చక్కగా అర్థం అవు తుండే.. అంచేత వీడు ఈ ప్రాంతాలకు సంబంధించినవాడు కాడేమో!.... ...

నా ఆలోచనలు ఈ దోవన గబ గబ దొర్లుకుని వెడుతూవున్నాయి. వాటి వెంట వెళ్లడానికి ఆ అబ్బాయి ఒప్పుకుంటేనా. మరొకసారి నాకేసి దీనంగా చూస్తూ "యెన్నిసార్లని అడిగేది ఒక మేక బొమ్మని చప్పునగీసి ఇయ్యమని" అని కళ్లలోకి సూటిగా చూస్తూ అడిగాడు.

ఏం జవాబు చెప్పాలి వాడు అలా బిక్క మొహం వేసుకుని అడుగుతూవుంటే! ఆ దిగ్భ్రమావస్థలోనుంచి బయటపడేటప్ప టికి ఎంత సేపయిందో చెప్పటం కష్టం.... "సరే......దాంతో ఏం చేసుకుంటావు?" ఈ మాట పెగిలి వచ్చేటప్పటికి బ్రహ్మాండ మైంది నాకు. వాడు మరొకసారి బుంగ మూతి పెట్టుకుని "ఒక మేక బొమ్మని గీసి ఇయ్యి. చప్పు చప్పున గీసి ఇయ్యి" అని అడిగాడు. అబ్బాయి అంత మురిసి పోతున్నాడు ఒక బొమ్మను గీసి యియ్యాసి. నా ప్రస్తుతావస్థలో అలాటి పనులను చేయ టానికి వుత్సాహం ఎక్కడినుంచి వస్తుంది? అసలు బొమ్మలను గీయటం మానేసి ఎన్నో ఏళ్లయింది. అలాటి పనులకు కావలసిన తతంగం ఎంతో వుందిగా. అదంతా ఈ క్లిష్టావస్థలో నాకు ఎలా లభి స్తుంది? అదంతా సేకరించాలనుకున్నా దినాల పర్యంతం నడవాలి ఎడారి కవతల నున్న ఏవూరోచేరుకోటానికైనా అలా వెళ్ల

(331 వ-పేజి చూడుడు)

# కేనోపనిషదు

మూలం:
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



## ప్రథమ ఖండము

### గురు శిష్యులు

(గత సంచిక తరువాయి)

బ్రహ్మవిద్యయందు గురువునకుగల విశిష్టత కేనోపనిషత్తు ప్రారంభముననే కనబడుచున్నది. పరిపూర్ణ గురువుల యున్నత గుణములను ముందు తెలిపి యున్నాము. అతడు శ్రుతుల పరిపూర్ణ జ్ఞానయుక్తుడై సత్యమున ప్రతిష్ఠపొందియున్నాడు.

కేనయందలి తొలిమంత్రము చదువుటవల్ల, ఒక ఆశ్రమము, అందు తన నిరాడంబర ఆసనమున కూర్చుని, సత్యజీవిత ఆనందరసమున తులతూగుచుండు గురువు, దైవమానవుడు, ఆత్మజ్ఞానమువల్ల పరమశాంతి, సంతృప్తిగల మహనీయుడు స్ఫురణకు వచ్చుచున్నాడు. అతనివద్దకు, సర్వాంగ సౌష్టవము, ఆరోగ్యభాగ్యముగల యువకుడు, వినయ విధేయతలతో జ్ఞానభిక్షకొరకు సమిత్పాణియై, వచ్చి గురుచరణములకు నమస్కరించుచున్నాడు. పరిశ్రమచేసి, పరిపూర్ణశాశ్వత పదవినిపొంద నాత్రపడుచున్నాడు.

గురువు తన నిశ్చల గంభీర దృష్టితో, పరిపూర్ణ ప్రేమ భావముతో శిష్యుని ఆశీర్వదించుచున్నాడు. అతని ప్రేమహృదయమునుండి కటాక్ష దృష్టి ఉప్పొంగి శిష్యుని అంతరంగమున జొరబడుచున్నది. గురువు శ్రుత్యర్థములందు పరిపూర్ణుడు కాకుండినచో, శిష్యుని దృష్టిని అంతరాత్మవైపు మరల్చజాలడు. మరియు గురువు సర్వజ్ఞుడుగ నుండుటయేగాక, పరిపూర్ణ ఆత్మ యొుకయందు నివసించుచుండవలెను. లేనియెడల శాశ్వత జ్ఞానకటాక్షము శిష్యునియందు ప్రసరింపజాలడు.

వారణాశియందు నివసించు పండితులు పూర్ణ శ్రోత్రియులు, గాని బ్రహ్మనిష్ఠాపరులుకారు. ఒక పర్యాయము జ్ఞానపీఠమగు ఆకాశపట్టణమున ఈ సాధువు ఒక పండితుని పాఠమంతయు పూర్తిగ ఆలకించెను. పాఠము ముగిసినవెనుక "పండితోత్తమా! మాయాజనిత మనసు లయము పొందుటతోడనే సత్య జ్ఞానము ప్రకాశించునని శాస్త్రములు నిరంతరము బోధించుచున్నవి. కాని, ధ్యానమువల్ల మనోనాశము చేయుట సాధ్యమా?" అని ప్రశ్నించెను. పండితుడు నిరాడంబరముగా "అబ్బాయీ! ఈ విషయము నీవు తెలియకోరి, ఉపనిషదు బోధలయందు ప్రవేశము కోరుచుండినచో, వారణాశివదలి, హిమాలయములందలి మహాత్ములను ఆశ్రయించుము. శాస్త్ర జ్ఞానము వ్యవహార ప్రమాణమా! కాదా! మాకు తెలియదు. మేము శాస్త్రములు ప్రమాణములని నమ్మియున్నాము. ఇంతవరకు ఏకాంతమున కూర్చుని మనోలయముపొంది, ఒక క్షణమయినను ఆనందించి యుండలేదు. అందలి ఫలితమగు సుఖమును రుచి చూచియుండలేదు. అందువలన నీ ప్రశ్నకు తగు సమాధాన మివ్వజాలము" అని పలికెను.

ఈ ప్రశ్ననే హిమాలయ ప్రాంత్యమున అనేక మహాత్ములను ప్రశ్నించియున్నాను. అన్నిచోట్లను, అందరి వాక్కునుండియు, ఎట్టి సంశయములేక, ఒకే సంతోషవార్త "అది సత్యము, అది సత్యము, అది సత్యము" అను కేకలు ప్రతిధ్వనించెను. అట్టి మాటలు,

సాధకుని హృదయమున ప్రవేశించి, గాఢ ఆదర మివ్వగలుగుచున్నవి.

మరియు, కొద్ది మహా పురుషులు, హిమవత్ప్రాంత్య మున వసించుచు, ఆత్మసాక్షాత్కారమువల్ల బహు గౌరవము పొందుచున్నారు. కాని, వారు తమ అనుభవములను వెలిబుచ్చుటకు తగు భాషాజ్ఞానము లేని లోపమువల్ల గురువులనిపించుకొనలేకున్నారు. వారు కొన్ని వాక్యము లపుడపుడు పలుకుదురు. అవి వెంటనే కరిగిపోవుచున్నవి. కొన్ని మాటల భావము శ్రోతలకు విశదమగుటలేదు. అట్టివారు, తమ జీవిత చేష్టలచేత, మౌనదీక్షతోడనే మనకు అఖండానంద మును కలిగించుచున్నారు. అందువల్ల, చక్కని బ్రహ్మనిష్ఠాపరుడును, పరిపూర్ణ శ్రోత్రియుడుగ నుండిన యెడల, సర్వవిధ శిష్యులకు గురువుగా నుండ గలడు.

అట్టి పరిపూర్ణ గురువును, శిష్యుడు శరణుజొచ్చి, భక్తిసలిపి, సర్వకష్టములకునోర్చి, సుశ్రూషచేసి, నిర్మలుడై, జ్ఞానోత్పత్తి కోరుచున్నాడు. ఈ రీతి, ప్రథమ మంత్రముననే, ఒక సత్ శిష్యుడు పొందవల సిన గుణగణముల సూచన కనబడుచున్నది. ఆ మంత్రమునందలి ప్రశ్న, శిష్యుని మానసిక, పార మార్థిక యోగ్యత తెలుపుచున్నది. అతడు జీవిత మును ధైర్యముతో ఎదుర్కొని, విచక్షణతో జీవించి, ఇంద్రియాధీన జీవితమంతయు బూటకమని తెలుసుకొనియున్నాడు. అంతకన్న గొప్పదగు శాశ్వత ఫలము నపేక్షించి జీవించకోరుచున్నాడు. తన అన్వేషణా ఫలితముగా, అతనికి ప్రపంచ విషయముల యెడల విచక్షణాజనితవిరాగ మేర్పడెను. తనయందు గొప్పదియు, ఉత్కృష్టమయినదియునగు లక్ష్యమును వెదకుచున్నాడు.

ప్రపంచమున చక్కగ జీవించలేనివారు మాత్రము సన్న్యాసులు కావచ్చునను దురభిప్రాయము వ్యాపించి యున్నది. దీనివల్ల పారమార్థికమనగా నేమో మనకు తెలియదు అను అజ్ఞానము ప్రకటితమగుచున్నది. కేన యందును, కఠోపనిషత్తునందును కనబడు శిష్యులవంటి వారే సన్న్యాసము పుచ్చుకొన అర్హులుగానున్నారు. అట్టివారే, సత్యాన్వేషణమున జయము పొందగలరు.

శరీరబల సౌష్టవములుకలిగి, కొద్ది కొద్దిపర్వతముల నునాయాసముగ నెక్కగలిగినవారే కైలాసగిరి శిఖర మును అధిష్ఠించ యత్నించగలరు. ధైర్యము సాహ సము, అవిచ్ఛిన్న కార్యదీక్షా పరత్వములు లేనివారు పర్వతముల నధిష్ఠించలేరు. పారమార్థికమునకూడ ఉన్నత శిఖరముల నధిష్ఠించుటకు ఈగుణములుండ వలెను. శారీరక, మానసిక, విజ్ఞానసంపద కలవారికి ప్రయత్నములు సఫలముకాగలవు. ఇట్టి గుణసంపద లేనివారు కొంత క్రింది అంతస్థువారికి నియమింపబడి యుండు సాధనలను చాలకాలము అభ్యసించి తన కుండు లోపములను తొలగించుకొనవలెను.

ముఖ్యముగ ప్రపంచ విషయానుభవముల వల్లనే మనలో లోపము లేర్పడుచున్నవి. విచక్షణలేని, అహంభావ సోమరియగు ధనికుని కుమారుడు, తన తండ్రి మరణించిన వెంటనే లేక, తన ధనమంతయు బ్యాంకులో మునిగిపోయినదని తెలిసినవెంటనే, విచక్షణకలిగి, తెలివితో పరిశ్రమ చేయ మొదలిడు చున్నాడు. ఇట్లు మనలో ప్రతియొక్కరికిని, ఏదో కొంత కొంత ఇట్టి అనుభవములుగలుగుచునేయున్నవి. వాటిని మనము విచక్షణతో స్వీకరించి తగు సవరణ కలిగించుకొనవలెను. ఇట్లు విధికి స్వాగతమిచ్చి నపుడు ఆ విధి మనలహింసించుటకు బదులు సేవ చేయు వైద్యునివలె ఉపకారము చేయుచున్నది. దురదృష్టమనునది మనకు బంధముకానేరదు మన లోని జీవలతను, ప్రభువను వృక్షమును ఆశ్రయించు ఆలింగనముగా నుండును.

శివభక్తునికి శివలింగమెట్లావశ్యకమో, సత్యా న్వేషణునకు ఒక సద్గురువు అనివార్య ఆవశ్యకము. శిష్యునికి తగు గురువే వేదచోదిత పూర్ణాంశము. భక్తునికి లింగమున భగవంతుడు తప్ప శిల కనబడుట లేదు. అటులనే, శిష్యునికి గురువునందు పూర్ణ బ్రహ్మము తప్ప ఎట్టిలోపములు కనబడుటలేదు. అట్టి శిష్యునికి గురువు పరిపూర్ణ స్వరూపుడు. పూర్ణా

నంద స్వరూపుడు. శాశ్వత జ్ఞాన స్వరూపుడు. ఇట్టి గుణములు ఎవనియందు మనము చూచుచున్నామో అతడే మనకు గురువు. కాని! ఎట్టిగురువుగాని, తన శక్తి చేత నిన్ను ఒకక్షణకాలములో దైవస్వరూపునిగా జేయగలడని నీవు ఆశించినచో నీ కోరిక వృధాకాగలదు.

నిజముగ ఆత్మోద్ధారణ, మనవలననేకలుగవలెను; బాహ్యసామగ్రియగు దేవళములు, విగ్రహములు, గురువులు, మొదలగునవి మనకు ధైర్యమొసగి సహాకరించగలవు. ఇట్టి బాహ్య సహాకరములను మన శ్రేయస్సుకొరకు మనము విచక్షణతో ఉపయోగించుకొనవలెను. తత్ఫలితముగ యోగ్యమగు అంతర సంస్కారము పొందవలెను. అంతర నైర్మల్యముతో, పరిపూర్ణగుణములతో, సాధకుని పారమార్థిక సంపద పెరిగి, తన శుద్ధజ్ఞానమువల్ల సన్మార్గమున ముందు పురోగమించవలెను.

వేదాంతునికి, తన శుద్ధ విజ్ఞానమే సద్గురువు. నిర్మలతగాంచిన మానసిక అభిలాషయే శిష్యుడు. ఈ విషయము భగవద్గీతయందు స్పష్టముగ తెలుపబడియున్నది. కలహించుటకు సంసిద్ధముగనుండు ఇరు సైన్యములమధ్య పరిపూర్ణగురువు, రథమునకూర్చుని, శాశ్వత శిష్యుడగు అర్జునునికి గీతనుబోధించుచున్నాడు. ఏ సమయమున దుర్గుణముల సంఖ్యపెరిగి, కొద్దిగనుండు సద్గుణములను ఎదుర్కొనసమకట్టునో, అప్పుడు పరిశుద్ధమనసు - అంతర కృష్ణ భగవానుడగు నిర్మలవిజ్ఞానమునకు పూర్ణశరణాగతి పొందుచున్నది. సజీవులగు ఇట్టి అర్జునులందరును తమ హృదయమనబడు అంతర కురుక్షేత్రమున ఇట్టి దివ్యగీతను పూర్ణముగ వినగలుగుచున్నారు. అందుకు మనము మన మనసున నిస్సహాయ, నిశ్శబ్ద, శరణాగతి పొందగల ప్రమాదకరక్షణమునకు అభిముఖులై, నిజ అర్జున స్థితిని పొందుటవలన లభ్యమగుచున్నది.

ఇందు ముఖ్యవిషయము - స్వప్రయత్నము. శ్రద్ధతో కూడిన సాధనవల్ల కరణములను మలినరహితము గావించవలెను. పిమ్మట మనకు ఆగత్యముగ ఏర్పడు గురువు స్వయముగ మనలను చేరగలడు. ఇది అమరశాసనము. ప్రపంచమున గంటగంటకు మన మనుభవించుచునేయున్నాము. మరుసమయమునకు మనకు ఎట్టి స్థితియుండవలెనో సర్వసాక్షి, కరుణామయ ప్రభువు తెలిపును!

శ్రీరామకృష్ణ పరమహంస గురువుకొరకు ఎట్టి అన్వేషణ చేయలేదు. మనకాలము నందనేక మహాత్ములుకూడ అట్లునే యుండిరి. శ్రీతోతావు మహారాజ్. దక్షిణేశ్వరము వెళ్ళి, తల్లియొక్క ప్రియ పుత్రునికి తానుస్వయముగ ధ్యానవిధానమునగల సూక్ష్మములు బోధించవలసివచ్చెను. మీలో ప్రతియొక్కరును ఆ ప్రభువుకు అమూల్యపావనప్రియులగానున్నారు. ఒకడు గురువుయొక్క ఆవశ్యకతకు అర్హుడుగనుండినచో గురువు తానుగా అతనిని సమీపించి మార్గముచూపి, సహాయపడి జ్ఞానోత్పత్తి కలిగించును.

సాధనను గట్టిగపట్టుకొనవలెను. మంచిగానుండవలెను. దయజూపవలెను. శ్రద్ధగలిగియుండవలెను. భావములను నిర్మలము చేయవలెను. జీవితము విలువగల ప్రేమ, కరుణ, దానము, పరిశుద్ధత, అను సుగుణములమీద ఆధారపడి యుండవలెను. నిరంతర భగవన్నామ స్మరణవల్ల పారమార్థికమున అభివృద్ధి చెందవలెను. అట్టిశ్రద్ధగలవారిని గురువులు తరచుగా సందర్శించుచుందురు.

ప్రారంభమంత్రమున "విషయములవైపు పరుగిడు మనసును" నియమించువారెవరు! అనుటయే గొప్ప ప్రశ్న.

పతతి = బాహ్యమున పోవుచున్నది అనుటలో, స్ఫూర్తి అనబడు వేదాంత సిద్ధాంతము ఇమిడియున్నది. ఆత్మచైతన్యము మనసును అధిష్ఠించి యున్నది. ఆశక్తి జ్ఞానేంద్రియముల ద్వారా ప్రవహించి, విషయములగు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను) చేరుచున్నది. అట్టిమనసు ఆ విషయభోగములను పొందుచున్నది.

ఎట్లనగా, మనము ఒకకుండను చూచుచున్నాము. మనసు కన్నులద్వారా బైటికి ప్రవహించి, కుండ యందు చోటును చేరును కుండాకారము పొందును. కుండయందలి చైతన్యము మనోచైతన్యకిరణములతో కలిసినపుడు కుండను మనము గుర్తించుచున్నాము. "ఇది యొకకుండ" అనుచున్నాము. ఇట్టి గ్రాహక సిద్ధాంతమునను సరించి, కేనోపనిషత్తునందలి శిష్యుడు మనసు ఎవరి పరిపాలనవల్ల వెలుపలికి పరుగిడు చున్నది" అని ప్రశ్నించుచున్నాడు.

మనసుకు ఆధారముగానుండి, మనసుకు తేజసు వ్యవహారశక్తి నొసగు దివ్యశక్తి ఏది?

## ఆత్మ పవిత్రత పొందుట

ఇదివరకు వేదవాఙ్మయమున ఉపనిషత్తులకుగల స్థానము, వాటి తాత్పర్యము విచారశైలి, వాటి అర్థమును బోధించగల గురువుయొక్క ఆవశ్యకత, వీటిని గూర్చి విచారించియున్నాము. గురువునందలి అత్యున్నతగుణగణములను తెలుసుకొనియున్నాము, కడకు ఈగురు శిష్య సంవాదము, మన అంతరంగమున జరుగవలసిన వ్యవహారముగనున్నదని విమర్శించి యున్నాము. బాహ్యమున గురుశిష్యుల చర్చలు ఎంతటి పూర్ణముగను, విశేషముగనుయున్నను సాధకుని అభివృద్ధికి అతని సూక్ష్మసత్యకేంద్రమును అతనిలో కనుగొనుటకు సహాయపడజాలవు.

మనయందలి ఆత్మ ఒక స్వప్నప్రపంచమును కల్పించుకొనియున్నది. అందువలన మన పరిమితుల, లోపములననుభవించుచున్నాము. మనప్రత్యక్ష అనుభవములకన్న, మన సత్యస్వరూపము అతిసంపూర్ణమైనదని మనకు అంతరాత్మలో స్ఫురణ కలుగుచున్నది. ఇట్టి "ఆత్మాందోళన" యనబడు హెచ్చరిక ప్రతియొక్కరికిని కలుగుటలేదు. ఎందుకనగా, మనలో చాలమందికి ఈ అంతరాత్మ మూకత్వముపొంది యున్నది. దాని చేష్టలు మనము గుర్తెరుగలేకున్నాము. మనము పరిపూర్ణులు కావలెయునను ఇచ్ఛ జనించగ, సర్వవ్యవహారములలో మనము ఊహించుచున్నాము.

మనలో అపార పరిపూర్ణశక్తి, ఆత్మజ్ఞానము ప్రకాశించుటకై దాగియున్నదనుటకు ఇదియే నిదర్శనము. "నిర్మలమనసుతో, సత్యజ్ఞానము పొందుటకు ఆతురత కలిగి, గురువును ఆశ్రయించుము" అనుట, కేవల వేదాంతులభ్రమలనియు, గొంతెమ్మ కోరికలనియు మీరు తలచవచ్చును.

నిజముగా, మానవుడు తన నిజస్వరూపమును మరచి పోయి యున్నాడు. మనము పరిచ్ఛిన్న అహంకార భావముతో, పరిమితులచే నొక్కడు పొందుచున్నాము. మలరహితము, అపరిచ్ఛిన్నము, నిత్యము అగు పరమాత్మ స్వరూపమే మన నిజ స్వరూపమనుట మరచియున్నాము. పిచ్చిభ్రమలకు పాత్రులమై అసత్యము వెంట పరుగిడుచున్నాము. దుఃఖము, వ్యసనము, మన స్వభావ గుణములై యున్నవి. శాశ్వత సత్యమార్గమొకటి యున్నదని ఎవరైన తెలిపినను, దానివైపు తొంగిచూచుటకు సాహసించకున్నాము. మన వ్యసనములవల్ల, కన్నీరు కార్చుచు, మానహీనులమై మన దుర్గుణములనుండి, దుఃఖములనుండి తప్పించుకొనలేకున్నాము. మన స్వరూపమునే పూర్తిగ విపరీతముగ భావించి యున్నాము.

బాహ్యమున ప్రకాశములేకున్న ఒక వస్తువు కనబడుటలేదు. వస్తువు అగుపడుటకు ప్రకాశమావశ్యకము. మనము కండ్లుమూసుకొనినపుడు ఒక పేనా, కుర్చీ, కుండ వీటిని "చూచుచున్నాము" అని చెప్పెదము. ఆ చూచుటకు ప్రకాశము ఆవశ్యకము. ధ్యానము చేయునపుడు మురళీ మనోహరుని ఆకారము మనస్సు పొందుతున్నది.

ఇది కృష్ణమానసికవృత్తిఅనబడును. ఈ వృత్తిని ప్రకాశింపజేయు ప్రకాశమేది? ఈ ప్రకాశము జ్ఞాన ప్రకాశముకాదా? మానసికవృత్తి స్వయముగ మనలను బెదరింపజాలదు. ఈ జడ స్వరూప మానసిక వ్యవహారము జ్ఞానప్రకాశముయొక్క ఆధారముపొంది మనలను హింసింప మొదలిడుచున్నది. మానసిక వృత్తికి మనము శక్తి కల్పించుటవల్ల, అది మనలను బాధించగలుగుచున్నది. మన మనసుకు మనమే శక్తి

కల్గించుటవల్ల, మనము సంసారులను నాటకము ఆడు నట్లు అది మనలను నియమించుచున్నది.

మనసును నిలుపుము. సంసారములేదు. ప్రపంచములేదు. "జాగ్రత్తపొందుము." ఇదియే హెచ్చరిక - మనవలన సాధ్యము. అట్టి జాగ్రత్తి పొందుట, పరిశుద్ధ హృదయముతో గురుచరణముల నాశ్రయించి, వికసిత జ్ఞానముతో "అంతరాత్మ ఎచ్చట నున్నది?" అని ప్రశ్నించవలెను. ఇట్టి నిగూఢ సత్యమును విచారించుటలో యొక మార్గదర్శియొక్క సహాయమత్యావశ్యకము. ఏ కొద్దిమందికో అవసరముండకపోవచ్చును. మన బాహ్యదృష్టినుండి చక్కగ వెనుకకు మరలి, అంతర దృష్టిని పొందవలెను. భక్తుని ధ్యానగదియందు ప్రభువు సదా ప్రత్యక్షముగ నున్నాడు.

దేవాలయమునందుండు ప్రభువు, జరీచొక్కాయను ధరించి, జనసముదాయమునకు దర్శనమిచ్చుచున్నాడు. ప్రతి భక్తుడును "తన మేడనుంచి" ప్రభువును దర్శించుచున్నాడు. కాని, వారిరువురికి సన్నిహిత సంబంధ మేర్పడియుండలేదు. అతనితో అతిసమీప కలయిక కోరుచున్న యెడల, అతని ప్రత్యేక గదికి వెళ్ళుము. యోగోత్తములందరు అతని ప్రత్యేక గదియందే అతని దర్శనము పొందియున్నారు.

ప్రభువుయొక్క లోపలి ఆవరణము చేరుటకు ముందు, నమ్రకము, కృతజ్ఞత, ప్రేమ అను సుగుణములను నీవు కలిగియుండవలెను. అతనిని కలియుటకుగల అతని శయన గృహమే - శుద్ధఎఱుకను - చేరవలెను. అదియే ప్రభువుయొక్క నివాసస్థలము! ప్రభువుయొక్క స్వస్థానము, శయన గృహము, అగు శుద్ధ ఎఱుకను మనము చేరగలము. ఆ గది చేరుటతోడనే మనము, అతడు ఏకమగుచున్నాము. అతని శయన గృహమనబడు, మన అంతరమున ఇట్టి దూకడము, సద్గుణ సంపన్నుడగు శిష్యుడు, శ్రద్ధాభక్తులతో గురువు నాశ్రయించి, శ్రుతివాక్యముల విచారించుటవల్ల కలుగుచున్నది. అట్టి విచారము, ఒక పరిపూర్ణ శిష్యుడు, ఒక పరిపక్వ గురువును కలసినపుడు - కేనోపనిషదునందువలె - ఫలదాయకమగుచున్నది.

మనసు బైటికి పరుగిడి విషయములను వెదకుచున్నది. విషయముల ఆకారము అది పొందుచున్నది. వేదాంతమున ఇట్టి విషయగ్రహణ సిద్ధాంతమును ముందు విమర్శించియున్నాము. గంగానది తూర్పు దిశకు పారుచున్నది. ఒక గ్రామవాసుని ఇందుకు కారణమడిగినచో "అది తరతరములుగా తూర్పుదిశకే పారుచున్నది. కనుక ఇపుడుకూడ అటులనే పారుచున్నది" అని తెలుపగలడు. "ఒక నవయుగ ప్రకృతి శాస్త్ర విద్యార్థిని ప్రశ్నించినచో, తూర్పుదిశయందు దేశము పల్లముగ నున్నది. నీరు సదా పల్లమునకే పారుట స్వభావము. కనుక ఈ నది తూర్పుకు ప్రవహించుచున్న"దని సమాధానము తెలుపును. ఇట్లు విషయముల సత్యజ్ఞానము కలుగుటవల్ల వాటి వ్యవహారములను రమ్యముగ ప్రకటించవచ్చును'

పారమార్థిక లాభము పొందవలెనన్నచో, ప్రతిక్షణమునను, మన బాహ్యముననేగాక, అంతరమున కూడ కలుగుచుండు వ్యవహారములను సూక్ష్మజ్ఞానముతో గమనించుచుండవలెను. కాని దురదృష్టవశమున మనకుగల మనోబుద్ధులనబడు పనిముట్లు ఉపయోగపరుపక, ఇనుపకత్తి తుప్పుపట్టినట్లు, నిరుపయోగముగ నున్నవి. తరతరములుగ మన విజ్ఞాన సాధనములగు మనసు, బుద్ధిని, నిర్లక్ష్యముచేసి, భావములు, ఆలోచనలు, పరిశీలనలు వదలుకొనియున్నాము. వాటికి పదును పెట్టి ఉపయోగపెట్టవలెను. ఆ కార్యము శ్రద్ధతోకూడిన దీర్ఘసాధన వల్లనే సాధ్యము.

"మనసును ప్రసరించునది ఏది? మనసు తన విషయములవైపు వెళ్ళునట్లాజ్ఞాపించునదేది?" అను ప్రశ్నలు, కేనోపనిషదునందు శిష్యుడు ప్రశ్నించగలిగినట్లు, తాను తేజోవంతముగ జీవితమును గడుపలేని యెడల ఈ ప్రశ్నల భావమే అతనికి గోచరము కాజాలదు. ఇచ్చట, ఈ సాధకుడు, ఈ మాంసపు కండ్లు స్వయముగ చూచుశక్తిని పొందియుండుట లేదని, స్పష్టముగ తెలుసుకొనియున్నాడు. ఈ కండ్లకు తేజస్సునివ్వగల సూక్ష్మశక్తి, ఒకటి దీని

కాధారముగ నుండవలెను. అట్టి శక్తి చాల సూక్ష్మ మగుటవల్ల, మన స్థూలబుద్ధి దానిని సమీపింప లేకున్నది. అది కడు నాజూకగు శిల్పి తన పనియం దుపయోగించు కొరముట్లవలె నున్నది. అట్టి కార్యము మానవునియందు మృదుతర సామర్థ్యము, సూక్ష్మ ప్రయోగము, రహస్య హస్తలాఘవమున దాగి యున్నది. అదే విధమున, జ్ఞానేంద్రియముల కాధారముగనుండు సత్యనిమ్నతను కనుగొనుటకు చాల పరిశుద్ధమగు మనోబుద్ధుల సహాయ మత్యావశ్యకము.

సమష్టి జ్ఞానపరిచయము లేనిది, మన నిజస్వరూపము మనము తెలుసుకొనజాలము. ప్రస్తుతము, ప్రతి క్షణమును మనము స్వార్థలాభములకొరకు అసత్యవాదులను నమ్మి అహంకారమును పెంచుకొని జీవితమును పెంపొంద యత్నించుచున్నాము. - కనుక నిజమైన శాంతిని పొందలేకున్నాము !!

సంపూర్ణ పారమార్థిక విప్లవము అత్యావశ్యకము. నీవు సత్యమును వెదకుచు, నీ అంతరకేంద్రమును చేర ప్రయత్నించుటవల్ల, ప్రపంచముసుద్ధరించగలవు. ఆత్మ పరిశుద్ధతవలన, ప్రపంచ పరిపక్వదశ ఏర్పడగలదు. మన చుట్టునుండు ప్రపంచమంతయు, జడము. మన ఆత్మ పరిశుద్ధతవలన దానికి తేజము కలిగించవలెను. ఈ భావము ప్రతి విద్యావంతుని మనసునందును నెలకొనవలెను. మన కాలస్థితికి ఈ కార్యమత్యావశ్యకము. మనమృగభావములతో మనము కల్పించుకొనిన నరకమును తప్పించుకొనుటకిదియే ఉపాయము !!

మనకు ప్రాసాదింపబడియుండు మనసనబడు గొప్ప కొరముట్టును, ఒకని భావముల ఆలోచనలతో తేజోవంతము చేయుదుముగాక ! అట్టి శిక్షణపొందిన కొరముట్టుతో మనయందు దాగియుండు జ్ఞానము, చైతన్యము. ప్రకాశము అనబడు సంపదను వెదుక ప్రయత్నించెదముగాక ! మనవ్యక్తిగత విమోచనవల్ల ప్రపంచవిమోచన మేర్పడుచున్నది !

శ్లో॥ శ్రోత్రస్య శ్రోత్రం, మనసో మనో య

ద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య

ప్రాణః

చక్షుషః చక్షు రతి ముచ్య ధీరాః

ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి॥

గురువు:—అది చెవికి చెవి. మనసుకు మనసు. వాక్కుకు వాక్కు మరియు, ప్రాణమునకు ప్రాణము. కన్నుకు కన్ను. వీటియందు ఆత్మభావమువదలి, ఇంద్రియవ్యవహార జీవితము వదలుకొనిన జ్ఞానవంతులు అమృత పదవిని పొందుచున్నారు.

---

"నియమించు వారు ఎవరు ? అను నూటియగు ప్రశ్నకు, గురువు "కన్నుకు కన్ను" "చెవికి చెవి" అను సమాధానమిచ్చుచున్నాడు, ఎందుకనగా, అపారము, శాశ్వతమునగు జీవాంశమును సూటిగా నిర్వచించసాధ్యము కాదు. భగవంతుని నిర్వచించుట యనగా అతనిని దూషించినట్లగుచున్నది.

(సశేషము)



# కాబూలీ - వాలా

శ్రీమతి యమ్. శకుంతల

(గత సంచిక తరువాయి)

తనకి డబ్బివ్వలేదని ఖైదీ విరోధిని తిడుతుండగా మిని అక్కడికొచ్చి, "కాబూలీవాలా! కాబూలీవాలా!" అని పిలిచింది.

ఆమె మాటలువిని తలపైకెత్తాడు కాబూలీవాలా. ఆమెని చూడఁగానే అతని ముఖం విప్పారింది. అతని చంకలో సంచీలేకపోవటంవల్ల సంచిలో ఏముందని అడఁగలేదు మిని. కాని

"కాబూలీవాలా! నువ్వు మీ ఫాదర్ ఇన్‌లాస్ హౌస్‌కి వెళుతున్నావా?" అని అడిగింది మిని.

"అక్కడికేనమ్మా వెళుతున్నాను" అన్నాడు రహమాన్.

ఆ సమాధానం మినిని సంతోషపరచలేదని గ్రహించి, "నా చేతులే కనక కట్టబడివుండకపోతే ఫాదర్-ఇన్-లాని కొట్టి పారేసేవాణ్ణే" అన్నాడు.

రహమాన్ ఒక వ్యక్తిని హత్య చెయ్యటానికి ప్రయత్నించాడని, ఆ తప్పుకి కొన్ని సంవత్సరాలు కారాగారవాస శిక్ష అనుభవించాలని చెప్పారు తీర్పు. ఆ తీర్పు ప్రకారం రహమాన్‌ని కారాగారంలోకి పంపారు.

రోజులు, నెలలూ, సంవత్సరాలు గడిచిపోయినయ్. రహమాన్‌ని పూర్తిగా మిని మరిచిపోయింది. నాకూ అతని ప్రసక్తిరాలేదు.

ఆమె క్రొత్త స్నేహితురాండ్రతో కాలం గడిపేది.

అది ఆకురాలుకాలం!

పూజా శెలవరోజుల్లో మినికి పెళ్ళి చెయ్యాలని నిర్ణయించారు పెద్దలంతా కలిసి.

ఆ ప్రభాత సమయంలో ఈ భావలయంలో చెలరేగి ఆడుకొంటున్నయ్ పిల్లగాడ్పులు.

సూర్యకిరణాలు హేమవర్ణంలో ప్రకాశిస్తున్నయ్.

సన్నాయిధ్వనులు వినిపిస్తున్నయ్. "పెళ్లి అయాక మిని అత్తవారింటికి నన్ను విడిచిపెట్టి వెళ్లిపోతుంద"నే భావం హృదయాంతరాళాల్లో వ్యధని పుట్టించింది.

నాగదిలో కూర్చొని ఏవో లెక్కలు వ్రాస్తుండఁగా ఎవరో వచ్చి, నిలఁబడి, నమస్కరించారు. మొట్టమొదట అతనెవరో గుర్తించలేక పోయ్యాను. తర్వాత అతను 'రహమాన్' అని గుర్తించాను.

అతను సంచీ తేలేదప్పుడు. అతని క్రాప్ అంతా తగ్గించి వేయఁబడింది. అతని దేహం కృసించింది.

"ఎప్పుడొచ్చావ్ రహమాన్?" అని ప్రశ్నించాను.

"నిన్న సాయంత్రమే జైలులోంచి రిలీజై వచ్చానండి" అన్నాడు.

జైలులోంచి అన్నమాట నా తనువుకి గాఢంగా నాటింది. "సాటి మానవుణ్ణి పొడిచిన వ్యక్తితఁడు. అటువంటివాళ్లతో ఇదివర్లో ఎప్పుడు మాట్లాళ్ళేదు నేను. అతనురాకపోతే ఆ దినం ఎంతసుదినం అయేదో!" నిపించింది.

"ఇంట్లో శుభకార్యాలు జరుఁగుతున్నాయ్ రహమాన్ - వాటివల్ల నాకు తీరిక లేదు. మరో రోజున కనుపించవోయ్" అన్నాను.

ఆమాటలువిని వెళ్లిపోటానికి సిద్ధం అయ్యాడా వ్యాపారి. "ఆ చిట్టితల్లిని చూడరాదాండి?" అని అడిగాఁడు.

మినిని చూడాలని అతనికి కుతూహలం వుంది. ఆ కౌతుకంతోనే వచ్చాడతఁడక్కడికి.

వచ్చేటప్పుడు కొన్నిపళ్లని పొట్లంకట్టుకొచ్చాడతఁడు. ఎరిఁగిన వ్యాపారినెవరినో అడిగి తెచ్చి వుంటాడా పళ్లని.

"ఇంట్లో శుభకార్యం వుండటంవల్ల ఎవర్నీ చూట్టానికి వీల్లేదు రహమాన్" అన్నాను రెట్టిస్తూ.

అతని ముఖం వాలిపోయింది.

"వెళ్లివస్తానండి" అని చెప్పి వెళ్ళిపోయ్యాడు బైటికా కాబూలీవాలా.

నా మనస్సులో ఏదో తీరని బాధ పుట్టింది. అతనిమీఁద జాలి పుట్టింది. అతన్ని పిలుద్దాం అనుకొనేసరికి, అతఁడే తిరిఁగివస్తున్నాడు.

"మీ అమ్మాయికి ... ఈ పళ్లనైనా ... ఇప్పిస్తారా?" అన్నాడు నంజుతూ పాపం!

ఆ మాటల్ని దీనంగా పలికాడు.

వాటికి ఖరీదివ్వఁబోయ్యాను. ఇవ్వఁబోఁగా, "నేను వీటిని అమ్ముకోటానికి రాలేదండి బాబూ. ఆ చిట్టితల్లికి ... ఇద్దామని తెచ్చానంతే ... వీటిని నా చిట్టితల్లికిస్తే, అదే చాలు. వీటివల్ల లాభం పొందుదామని రాలేదండి, మీరు చాలా మంచివారు. నన్ను మీ హృదయాంతరాళంలో పదిలంగా నిదురింపచేస్తే చాలండి. మీకూ ... వుందొకబిడ్డ, నాకూ వుందొకబిడ్డ. మీ బిడ్డనిచూసి, 'నా బిడ్డే' అని అనుకొనేవాణ్ణి. ఆ వుద్దేశ్యంతోటే ఆమెతోటి నిత్యం కొంతసేపు సంతోషంగా కాలక్షేపం చేసేవాణ్ణి" అని. తన జేబులోంచి

మాసిపోయిన కాగితపు మడత నొకదాన్ని పైకి తీశాడు. తీసి దాన్ని విప్పి నా డ్రాయరుమీఁద పెట్టాడు. పెట్టఁగానే దాన్ని పరికించాను పరితపించే హృదయం తోటి, ఆ కాగితంమీఁద ఒక చిన్న బాలిక చేతి సిరా ముద్దర కనుపించింది.

అతఁడీదేశం వచ్చేముందు తన కూతురి జ్ఞాపకార్థం తెచ్చుకొన్న చిహ్నం అది.

ఆ చేతి ముద్దర చూడగానే నాలో కరుణారసం ప్రవహించింది, హృదయం కరిఁగిపోయింది.

దాన్తో అతఁడో పళ్లవర్తకుఁడని మరిచి పొయ్యాను.

అతనికంటె నేనేం ఎక్కువ? అతఁడూ ఒక తండ్రే. నేనూ ఒక తండ్రినే, కాని అతనికుండే హృదయం నాకులేదు. అతని పిల్లకి బదులుగా నా పిల్లని ఎక్కువ ప్రేమించాడు. ఆమెతో ఆడాడు. పాడాడు ఆనందించాడు. ఆమెతోఫ్నుండి తన పిల్లని సహితం మరిచిపొయ్యాడు. అతనిదే పితృహృదయం.

నేనొక ధనికుణ్ణె అవటానికి, కాని ఏం లాభం! ఈ ప్రపంచకంలో నేనో మూఁఢుణ్ణికదా! అతనికుండే తండ్రి ప్రేమ ఎక్కువకదా!

దూరంగా ఎక్కడో పర్వత ప్రాంతాల్లోనున్న అతని కూతురైన పార్వతి చేతిముద్దర నాకు మా మినిని జ్ఞప్తికి రప్పించింది.

వెంటనే మినికోసం కబురుచేసి, ఆమె ఈ సమయంలో రావటానికి వీల్లేదని బయలుదేరిన ఆటంకాల్ని లెక్కచేయకుండా, ఆమెని రప్పించాను.

పెళ్లి దుస్తుల్లో ప్రత్యక్షం అయిందక్కడ మిని.

ఆమె పెద్దదయిందిప్పుడు. పూర్వం కాబూలీవాలా, మిని ఇద్దరు ఆడుకొన్నప్పుడున్నట్టులేదామె.

"అమ్మా మీ ఫాదర్ ఇన్ లాస్ హౌస్‌కి వెళుతున్నావా?" అని అడిఁగాడతడు.

ఆ మాటకి పూర్వం అతఁడనుకొన్నట్టుగా ఆమెలో సంచలనం కలిగింది. తలవాల్చేసిందా మాటకి వచ్చిన సిగ్గుతోటి. ఆ మాటకి అర్థం తెలిసిందామె కిప్పుడు.

తలవంచి కాబూలీవాలాకి ఎదురుఁగా నిలఁబడింది మిని.

మిని, కాబూలీవాలా. ఇద్దరుకలుసుకొన్న రోజు జ్ఞాపకాని కొచ్చింది నాకు. నాలో విచారంపొంగి పొర్లి పోయింది.

ఆమె ఇంట్లోకి వెళ్లి పోయినప్పుడు




శ్రీమతి V. సుశీలాదేవి B. A.

నా పిల్లలందరికి ప్రత్యేకంగా ఒక్కొక్కరికి వొక్కొక్క తోటవుంది. తోటంతా పూలగోలాలతో నిండివుంది. ఒక రోజున ఉదయమే లేచి చూస్తే ప్రతిగోలాంలోను పూలు వికసించివున్నయి.

పాపం! పిల్లలు! ఎవరి పూలమొక్కలు వాళ్లకి అందంగా కనిపించేవి. ముగ్గురూ కలిసి 'మా పూలు బాగున్నాయి' అంటే, మా పూలు బాగున్నాయని పెద్ద చర్చ సాగించి, చివరకు దెబ్బలాటలో దిగారు. ముగ్గురికి ముగ్గురే! ఒకరు హిట్లరు అయితే, యింకొకరు ముసోలినీ మరియొకరు స్టాలిన్. ఒకరి నొకరు తీసిపోరు. ఈ త్రిమూర్తులకు తల్లినయ్యే భాగ్యము నాకు ఒకేసారి లభించింది.

ఆ యుద్ధంలో ముగ్గురు తీవ్రంగా తిట్టుకొంటున్నారు. అది విని నేను తోటలోకి వచ్చాను. నన్ను చూడంగానే, అందరూ ఒకసారి వారి వారి పక్షము సమర్థించుకుంటూ న్యాయం చెప్పుతున్నారు. న్యాయం చెప్పడమనేది కోర్టులో జడ్జీ చెప్పేటంత సులువుకాదిది. జడ్జీకైతే "లా" అని "రూల్సు" అని యేవేవో వుంటాయి. మరి నాకు అవేమిలేవు. ఎవరివైపు చెప్పిన వాళ్ళకు కోపం వస్తుంది. వీళ్ళకు తీర్పు యెలా చెప్పడమా అని ఆలోచిస్తున్నాను.

ఇంతలో వారి నాన్నగారొచ్చారు. వారికీ అరుపులు గిరుపులు యిష్టంలేదు. ఎవరైన కాస్త పంచమ స్వరంలో మాట్లాడడం అనేది అసలే యిష్టం లేదు. పిల్లల దెబ్బలాట చూడంగానే "ఎవర్రా? అది! ఎందుకు దెబ్బలాడుతున్నారు? మీరిలా దెబ్బలాడారంటే నేను మీ అమ్మను సత్యాగ్రహము చేయించను తెలుసా!" అని గట్టిగా కేకలేశారు.

ఇది వినగానే హిట్లర్, ముసోలినీలు శాంతించారు. ఏ తల్లిసహాయం లేకుండ రోజూ ఒక్కపని కూడ చేయలేరో, ఏ తల్లిలేకుండా రోజూ స్కూలుకు వెళ్ళలేరో, ఆ నా పిల్లలే నన్ను సత్యాగ్రహం చేయడం, జైలుకు వెళ్ళడం హృదయపూర్వకంగా కోరుతున్నారు.

అప్పుడు నేను వారితో "యిప్పుడేమి ఫిర్యాదు లేదుకదా!" అని అడిగితే, అందరూ ఒకే కంఠముతో "లేదమ్మా, అందరి పూలు బాగానే వున్నాయి. నీవు సత్యాగ్రహంచేయమ్మా, జైలుకు వెళ్ళమ్మా" అన్నారు.

మేమంతా యింట్లోకి వెడదామనుకొంటుంటే యింతలో బయటినుండి పిల్లల దీనాలాపన వినబడింది. అందరూ బయటికివచ్చి చూశాం. ముగ్గురు పిల్లలు. అందులో ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. పెద్దమ్మాయి పదేండ్లది, చిన్నదానికి ఎనిమిది ఏళ్లు, పిల్లాడికి అయిదేళ్లు వుంటాయి. మమ్మలను చూడంగానే వాళ్ళు పాటాపి మాకు దండంపెట్టి, ఆకలితో మండిపోతున్న వాళ్ళ కడుపును చూపించారు. పెద్దదాని చేతులో ఒక సంచి, చిన్నదాని చేతులో ఒక టిన్ను డబ్బా! రెండు ఖాళీవే! వాళ్ళు మమ్మల్ని యాచన దృష్టితో చూస్తున్నారు. నేనప్పుడు

"మీరు చాల బాగా పాడుతున్నారుగాని, యింకేమైన పాటలువచ్చా!" అని అడిగాను.

పెద్దది జవాబుచెప్పేలోపల చిన్నది "మాకు భజనకూడ వచ్చునమ్మగారు!" అంది. ఇంక మేము అడగకుండానే పాడడం మొదలు పెట్టారు. వచ్చి రాని మాటలతో ముద్దు ముద్దుగా ఆ పిల్లాడుకూడ పాడుతుంటే మాకు నవ్వొచ్చింది. మేము నవ్వడం జూసి పాపం! వాళ్ళు సిగ్గుపడి పాడడం మానేశారు. వారిని చూస్తూంటే యేదో తెలియని బాధ పడుతున్నట్టు కనిపించింది. అప్పుడు నేను "చాల బాగా పాడారుగాని, మీకేం కావాలి? అన్నం పెట్టమంటారా లేకపోతే బియ్యము వెయ్యమంటారా?" అని అడిగాను. పెద్దపిల్ల మళ్ళీ సలాంచేస్తూ "యేదో ఒకటి యివ్వండమ్మగారు, నిన్నటినుండి యేమీతినలేదు" అన్నది హీనస్వరంలో. పిల్లలతో వాళ్ళకు రెండు పూరీలివ్వమనిచెప్పి యింట్లోకి వెళ్ళాను.

పిల్లలు వాళ్ళకెన్ని పూరీలు యిచ్చారో తెలియదుగాని, ఇంట్లోకివెళ్ళి చూసేసరికి డబ్బాలో ఒక్క పూరీలేదు సరిగదా, దానితోపాటు గిన్నెలోని కూరకూడలేదు.

మరుసటిరోజు ప్రొద్దున్నే మేము టీ త్రాగుతుంటే మళ్ళీ ఆ బాల గాయకుల కోమల స్వరం వినిపించింది. అప్పుడు నేను పిల్లలతో "చూశారా! నిన్న మీరు బాగా పూరీలను రుచి చూపించారు. ఇప్పుడు చూడండి! మళ్ళీ వచ్చారువాళ్ళు! వాళ్ళకోసం యిక్కడ పూరీలుచేసి పెట్టినట్టు" అని అన్నాను. అందరూ ఒక్కసారి "చేసిపెట్టావుకదమ్మా" అని మళ్ళీ పూరీల డబ్బా దగ్గరకు పరుగెత్తారు. "ఇక ఆగండి. రోజూ యిదే పనేమిటి? ఇలాగ పూరీలు మరగనిస్తే వాళ్ళింక గుమ్మం వదలరు. కొంచెము బియ్యంపడేసి పంపండి" అన్నాను గట్టిగా.

ఇంతలో మా మొదటివాడు "పాపం! చిన్న చిన్న పిల్లలమ్మా! వాళ్ళ అమ్మందో లేదో! వాళ్ళు యెలాగ వండుకొంటారమ్మా" అన్నాడు జాలి వొలకపోస్తూ, ఇంక రెండవవాడు "దీనికంటె వాళ్ళకేమి యివ్వకుండా వుండడమే మంచిదన్నాడు" వ్యంగ్యంగా, అంతలో అందరికంటె చిన్నవాడు "నీవుకూడ తల్లివై వుండి యిలా మాట్లాడతావేమమ్మా! పాపం! వాళ్ళ కాకలివేస్తుందేమో! పోనీ, మా భాగంలోనిదైన వాళ్ళ కివ్వమ్మా" అన్నాడు ముద్దు ముద్దుగా. నేనేమి అడ్డుచెప్పలేకపోయాను. "మళ్ళీ మీకు రాత్రికి వండాల్సి వస్తుందన్నాను" ఉదాసీనంగా. "అమ్మా! మేము భోంచెయ్యములేమ్మా" అని అందరూ ఏకకంఠముతో పల్కి పూరీలు తీసికొని గుమ్మం దగ్గరకు పరుగెత్తారు.

తరువాత నేను ఇంట్లో పని ముగించుకొని యివతలకువచ్చి చూసేసరికి వాళ్ళెంతో ఆప్యాయంగా వాటిని తింటున్నారు. ఆ దృశ్యం చూసేసరికి నాకు జాలేసింది. వాళ్ళు వెళ్ళిపోతుంటే ఆపి "మీ ముగ్గురు అక్కా చెల్లెళ్ళా" అని అడిగాను. "ఔనమ్మగారు" అన్నది పెద్దది.

"మీ పేర్లేమిటి?"

"వెంకి, సీత, రాముడు."

"మీ అమ్మ నాన్న వున్నారా?"

అందరికంటె చిన్నది "అమ్మంది, నాన్న వున్నాడు. అందరూ వున్నారు" అన్నది ఆతురతతో. అయితే "మీ అమ్మ నాన్న యెక్కడున్నారు" అన్నాను.

"మా నాన్న అమరావతిలో, మా అమ్మ" ... అని చెప్తూంటే, ఇంతలో మా చిన్నవాడు "అమరావతిలో మీ నాన్న యేంచేస్తున్నాడు" అని అడిగాడు ఆదుర్దాగా. "జైలులో వున్నాడు చిన్న బాబుగారు" అని జవాబిచ్చింది.

నా కాశ్చర్యమేసి "జైలుకెందు కెళ్ళాడు?" అని అడిగాను.

"మా నాన్నయేమో! కల్లుతాగుతుండేవాడమ్మగారు, తాగిన వాడు వూరికుండేవాడుకాదు. మా అమ్మను నానా మాటలు తిట్టి చావకొట్టేవాడమ్మ

గారు! ఒక రోజున పోలీసులు తన్ని పట్టుకొని జైలులో పెట్టారండి” అని దీనంగా చెప్పసాగింది.

“అయితే మీ అమ్మ యెక్కడున్నది” అని అడుగగా, “మా అమ్మకూడ జైలులో వుందండి. దానితో మా తమ్ముడుకూడ వున్నాడండి. వాడు అందరి కంటె బాగుంటాడు అమ్మగారు” అని చెప్పకపోయింది. పాపం! పసికందులు తల్లిదండ్రులు చేసిన దుర్మార్గమువల్ల, అనాథులై వీధివెంబడి అడుక్కోవలసి వచ్చింది. ఇలాగ యెంతమంది అభాగ్యులు బాధపడుతున్నారో కదా! అని మనస్సంతా కలవరపడింది.

అయితే “మీ అమ్మ జైలుకెందుకు వెళ్ళింది?” అని అడిగాను,

“మా అమ్మ, మా నాన్నను పట్టుకొన్న పోలీసును చంపిందండి. అందుకని మా అమ్మనుకూడ జైల్లో పెట్టారండి! ఈ రాముడేమో రోజూ “అమ్మా, అమ్మా” అని ఒకటే ఏడ్పండి” అని జవాబిచ్చింది.

వాడి వాలకంచూస్తే దరిద్రదేవతంతా వాడిమీద తాండవిస్తుందన్నట్టుంది. చింపిరి గుడ్డలు చుట్టుకొని వున్నాడు. జుట్టుచూస్తే, నూనె అన్నమాటలేక పెద్ద ముళ్ళపొదలాగ చుట్టుకొనివుంది. ముట్టుకొంటె మన్ను అంటుకుకవస్తుందేమో అన్నట్లున్నది వాడి శరీరము. ఏడ్చిఏడ్చి కన్నీటిధారలు వాడి బుగ్గలపైన శాశ్వతంగా నిలచిపోయింది. వాళ్ళ ఆకారాలను చూస్తుంటే నా కెంతో బాధకల్గింది. “మీ అమ్మను చూడ్డానికి వెళ్ళరా? మీరు రాత్రిళ్ళు యెక్కడ పడుకొంటారు? మీకు చీకట్లో భయంలేదా?” అని అడిగాను పెద్ద పిల్లతో.

“వెళ్తావమ్మగారు మూడునెలలకొకసారి, జైలు దగ్గర ఒక కాలువవుంది. మేము రాత్రిళ్ళు వంతెన దగ్గర పడుకొని మా అమ్మతో మాట్లాడుకొంటూ నిద్రపోతామమ్మగారు!”

“మీ అమ్మకి యెన్ని రోజులు శిక్ష విధించారు!”

“రెండు సంllలు. మా అమ్మని జైలునుండి విడచిపెట్టగానే మేమంతా దేశం వెళ్ళిపోతామండి” అని చెప్పి, అప్పుడే వాళ్ళదేశం వెడుతున్నట్లు ఊహించి ఒక్కసారి సంతోషం పట్టలేక సతమతమైంది. నేను వాళ్ళదుస్థితిచూసి, వాళ్లకేదైన పాత బట్ట పడేయమని సౌంజ్ఞచేయగానే మా పిల్లలు వాళ్లకిష్టమొచ్చినట్టు బట్టలిచ్చిపంపారు.

ఈ సంఘటన జరిగిన రెండు రోజులకే నేను కూడ సత్యాగ్రహముచేసి జైలుకు అతిథిగా వెళ్లాను. మా పిల్లలందరు నన్ను యెంతో సంతోషముతో వీడ్కోలిచ్చారు.

జైలులో వివిధరకములైన మనుష్యులు. అదొక వింత ప్రపంచం! అందులో ఒక స్త్రీ తన పుట్టిన పిల్లను చంపిన హంతకురాలు! మరి యొకతె భర్తకు అత్తగారికి విషంపెట్టిన మహా ఇల్లాలు! వాళ్లను చూస్తుంటే నిజంగా వీరు స్త్రీలేనా? లేక రాక్షసులా! అనిపించింది.

నాకేదైన అందివ్వడానికి ఇద్దరు స్త్రీలను నియమించారు. అందులోఒకతె తెలివికలదై నప్పటికి కొంచెము వయస్సులో చిన్నది. మరియొకతె ప్రౌఢ! ఆమె వొళ్ళో ఒక కుర్రాడున్నాడు. ఆమెయెప్పుడూ అంతగా మాట్లాడేది కాదు. ఎప్పుడూ యేదో ఆలోచిస్తూ పని చేస్తుండేది. పాపం! చంటిపిల్లవాని వీపు మీదవేసికొనే అన్ని పనులు చేస్తుండేది. ఆమెను జూస్తేనాకు జాలివేసింది. ఆమె పేరు లక్ష్మి.

నేను యెప్పుడూ యీ లక్ష్మి యెవరు అని ఆలోచిస్తుండేదాన్ని. ఒక రోజున మేట్రన్‌ని “ఈమెవరని” అడిగాను. అప్పుడామె “అమ్మో! అమనిషా? చాల ప్రమాదకరమైన మనిషి! పోలీసును చంపింది. ఏం? మీకేమైన యిబ్బంది పెడుతుందా?” అని అడిగింది.

ఈ మాటలువినగానే ఆ బాలగాయకులు జ్ఞాపకం వచ్చారు. వాళ్ళ అమ్మకూడ జైలుకువెళ్లింది. నేను యెన్నోసార్లు అనుమానము తీర్చుకొందామను

కొన్నా, ఆమె గంభీరమైన, ఉదాసీనమైన మొహం చూసి అడగడానికి సాహించలేకపోయేదాన్ని.

ఒక రోజు రాత్రి పెద్ద ఉరుములు, మెరుపులతో వర్షంపడుతోంది. నాకు వెంటనే నా పిల్లలు జ్ఞాపకం వచ్చారు. చిన్నవాడికి ఉరుములంటె చెడ్డభయం! నన్ను గట్టిగా కౌగలించుకొని పడుకొనేవాడు. పాపం! ఆ వంతెనదగ్గరపడుకొన్న పిల్లలను తలంచుకొనేసరికి వొళ్ళంతా వొక్కసారి వణికిపోయింది. "హే పరమేశ్వరా! అందరి తల్లుల పిల్లలను రక్షించి. తరువాత నా పిల్లలనుకూడ రక్షించుతండ్రీ!" అని ప్రార్థించాను.

రోజూ నాదగ్గరికి పత్రికవస్తూండేది. జైలులోవున్న స్త్రీ ఖైదీలందరు యుద్ధపు వార్తలు వినాలని యెంతో వుత్సాహపడేవారు. నేనుకూడ పేపరు చదివి యేవో వార్తలు చెప్తూండేదాన్ని.

ఆరోజు సాయంకాలముకూడ పేపరువచ్చింది. పేపరు చదువుతుండగా, అకస్మాత్తుగా గుండె ఆగిపోయినంతపని అయింది! అది జబ్బల్‌పూర్ వార్త!

"నిన్నరాత్రి భారీవర్షము పడడంవల్ల జైలు దగ్గరగా నున్న కాలువలో ముగ్గురు బీదపిల్లలు కొట్టుకొని పోయారు. వారి శవాలు దొరికాయి వారిలో ఇద్దరు ఆడపిల్లలు, ఒకమగపిల్లవాడు. పాటలు పాడుకుంటూ ఆడుకొనే వాళ్ళని తెలిసింది"!

ఈ వార్త చదవగానే, ఆ ముగ్గురి పిల్లల చిత్రాలు కంటికి కట్టినట్లైంది. అశ్రుధారలు ప్రవహింపసాగాయి, నోటిమాటకూడ రావడంలేదు. "పాపం! పిల్లలు" అన్నమాటలు మాత్రము వచ్చాయి.

లక్ష్మి నాదగ్గర కూర్చుని టీ తయారు చేస్తూంది. "ఏం? అమ్మా! అలాఉదాసీనంగావున్నారు? పిల్లలు జ్ఞాపకంవస్తున్నారా!!" అని అడిగింది. కానిజవాబివ్వలేకపోయాను. ఆమె మళ్ళీ "పోనీలెండమ్మా! ఇంక కొద్దిరోజులేవున్నాయి. పిల్లలు తండ్రిదగ్గిరే వున్నారు కదా! ఇక భయమెందుకమ్మా" అంది. ఆ మాటలువింటూంటే, ఆమెవైపుచూడడానికైన ధైర్యంలేకపోయింది. తరువాత మెల్లిగా ధైర్యం చేసికొని "లక్ష్మి! నీకింకా పిల్లలేమైనవున్నారా?" అని అడిగాను.

ఆమె నీరసమైన నవ్వు నవ్వి "ఒక్కడే కాదమ్మా, ఇంకావున్నారు ముగ్గురు జైలు అవతల! వాళ్లు భగవంతుని పిల్లలమ్మా! నా పిల్లలని యెలా చెప్పమంటావమ్మా!" అంది కొంచెం గద్గదస్వరంలో.

తరువాత ఆమె యింకా వార్తలు అడుగుతునే వుంది. కాని యింక నేనేమి చెప్పలేకపోయాను.

"భగవంతుని లీల యెంత చిత్రమైనది! ఇలాగ యెంతమందిపిల్లలు తల్లిదండ్రులు చేసినపాపకర్మలకు గురయై అనాథలై అభాగ్యులై తిరుగుతూ, చివరకు ప్రకృతి వొడిలో శాశ్వతంగా నిద్రపోతున్నారో కదా!" అని అనుకుంటూ అలాగే కుర్చీలో కళ్లు మూశాను. ఆనాటి సంఘటన మరువలేని మరుపురాని దృశ్యంలాగ నిల్చిపోయింది.

# దమయంతి

శ్రీమతి దాసరి శారద



దమయంతి విదర్భరాజగు భీముని కూతురు. సుందరి, సుగుణవతి. జనులు నలుని గుణములు పొగడుచుండగాఁ విని మనసార నతని ప్రేమించినది. హంస తనకుఁ జిక్కినపుడు నలుని నాకు కూర్పుమని వేడినది.

ఇంద్రాది దేవతలు తన్ను వరింప మన్నను వినక మానవ మాత్రునందే మనస్సు గాఢముగ నిలిపియున్నదిగాని త్రిప్పుకొనలేదు. దేవతలు వచ్చి వేఁడిన నంగీకరింపని మానవస్త్రీలుందురా ? దమయంతి తప్ప. నలుడువచ్చి దేవతల వరింపుమన్నపుడామె యేమన్నదీ ? "ఏనేడ నింద్రాదులేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదా. నేను నీ ధనము. నీకై యీ రాజు లందఱి రప్పించితిమి. దయయుంచి నన్నంగీకరింపు"మని వేడుకొన్నది. "వారి పాదరజంబుఁబోలని వాని నన్ను మనుష్య సంసారిఁగోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నులై సురలుండఁగా" అని నలుడన్నపుడు దమయంతి కన్నీరుగార నేడ్చి "వారి సన్నిధినే నిన్ను వరియించెద. అపుడు మన మిద్దరము నిర్దోషులమగుదు"మని యుపాయముగ పల్కిన వివేకవతి దమయంతి. సిరివచ్చుచుండ మోకాలొడ్డినది దమయంతి. 'మనసున కైకొన్న భర్త మానందగునే ? ' అని సావిత్రివలె ననుకొన్నది గాఁబోలు.

నలుఁడు పుష్కరునితో జూదమాడుచు నోడిపోవుచుండ దమయంతి దూరదృష్టి కలిగి భర్తను వారింపక మంత్రిపురోహిత బాంధవాదులతో నాలోచించి తనకొడుకు నింద్రసేనుని, కూఁతు నింద్రసేనను తన పుట్టింటికంపినది, వారికపాయముకలుగకుండుటకు, తానొక్కతెయ భర్తతో నడవులలోఁ గష్టాలు పడుటకు. ఎంతయోచన? కట్టువస్త్రమును లేక బాధపడు నలుని మా పుట్టింటికేగుదము రమ్మన్నది. అందుకు పౌరుషవంతుఁడగు నలుఁడంగీకరింపక నీవరుగుమన్నాడు. అప్పుడామె నిన్ను వదలి నేనుపోను. నన్ను నీవు వదలి వెళ్ళవలదు,

"అఖిల దుఃఖరోగార్తున కౌషధంబు, సురు
చిరంబుగ భార్యయ చూవెయెందు !
నొనర భార్యా సమేతుఁడై యున్నవాని
కెంత లాపదలయ్యును నెఱుకపడవు.
అలయునెడ, డయ్యునెడ, నా, కలియుఁ
దృషయునైన యెడలఁ గనుఁగొని
ధరణీ తలనాథ పురుషునకు నిమ్ముల భార్యయ
పాచుఁ జిత్తమున దుఃఖమ్ము నృప."

అని నిన్ను నమ్ముకొనియున్న నన్ను వదలకుమని దుఃఖించినది. తాను గష్టాలు పడుచుంట చూచి నలుఁడు సహింపక వదలి వెళ్ళినచో నామె పుట్టింటికి జేరునుగదా యని నలుఁడు అనుకొనుచున్నాడని వాసన పట్టి అట్లన్నది. పరేంగితముల నెఱుఁగు నేర్పరి దమయంతి.

ఎఱుక తన్నపేక్షింపఁగా నపుడేమియు దోఁచక రక్షించుకొనన మఱొకయు పాయములేక శపించినది. ఈమెకడ శపించు శక్తియున్నది కాబోలు. అవల నామె చనుపతోఁగలసి సుబాహుపురము చేరి రాజమాతకడనున్నది. అపుడు రాజ భోగములనంగీకరింపలేదు. ఆమె రాజమాతతో,

"ఏను సైరంధ్రీవ్రతంబు చేకొని యుండెద. ఉచ్ఛిష్టంబు భుజింపను. పదధావనంబు చేయను. పరపురుషులతోఁ బలుకనోప. పతినన్వేషించుపొంటె నరిగెడు బ్రాహ్మణులతో బలుకుదు." అట్లైననే నీ యొద్దనుందునన్నది — ఎంత దీక్షయో జూచితిరా?

అవ్వల విదర్భకరిగియుఁ దన తల్లిదండ్రుల కడఁగూడ నామెయిట్లేయుండెను. భర్తచించుకొని పోఁగా మిగిలిన సగము చీరతోడనే యామెయున్నదిగాని మఱొక చీరను గట్టుకొనలేదు. పతివ్రతయన్న నామెయే. భర్తను వెదుకుటకే యల్లరి చిల్లరి వారినో పంపుట యపచారమనుకొని బ్రాహ్మణులనే మంచివారినే యేరిపంపినది. వారేగి నోటికి వచ్చినట్లందురేమో? అందుచే నలునకుఁగోపము వచ్చునేమో? అని యిట్లే అనవలెనని పాఠముచెప్పినది,

"సత్య నిత్యుండవు సతినింతి వర్జించి
దాని వస్త్రార్ధంబు దఱిగి నీవు
పరిధానముగఁ జేసిపాడియే పోవంగ?
భార్య భర్తయు నీఁగఁ బరగుధర్మ
మది మిథ్యయయ్యె నీయందు. నీకిట్టి
నిర్దయబుద్ధి చేకొనదగునె?

యట్టి సాధ్వికిఁ గరుణాప్రసన్నుండవగుము" అని చెప్పిపంపినది. ఈ మాటలు విని పౌరుషము, శౌర్యముగల నలుఁడుత్తరమీయకుండఁడని నలుని స్వభావ మెఱింగిన దమయంతి తలచినది. నలుఁడు కృశించి యెఱిగినవారైన గుర్తుపట్ట వీలులేని స్థితిలో నుండుననియు, అట్టి వాని నెఱుఁగనివారు గుర్తుపట్టుటెట్లనీయు నాలోచించి భావమువలనఁగాని గుర్తుపట్ట వీలులేదని యూహించి యిట్లన్నది. నిజమునకుఁ గృశించియేగాక వికృతాకారుడనయ్యు నలుడుండెఁగదా. అట్టి వాని నొరులెట్లు గుర్తించుట?

నలుని గుర్తించి నా క్షేమము చెప్పి తీసికొని రండన్నది. రానిచో నాసంగతి వచ్చి నాకుఁ జెప్పుడన్నది. పర్ణాదుఁ

డొఱిఁగివచ్చి చెప్పిన పిదప నతండే నలుడై యుండునని యనుమానించి వానిని రప్పించుటకై యోచించి యుపాయముఁబన్ని యతడే నలుడైనచో నశ్వహృదయ మతనికి వచ్చియుండవలె. అదియు బరీక్షింతమని భావించి యెల్లి ద్వితీయ స్వయంవరమని ఋతుపర్ణుడు తమ పట్టణమునకు వచ్చునట్లుచేయవలసినదని చెప్పి వివేకవంతుడును, నుపాయశాలి తన్నుఁ దెలిసికొనకలిగినవాడునగు సుదేవు నంపినది. మరియందరు దూతకృత్యమును నెరవేర్పగలరా ? ఋతుపర్ణుఁడు విదర్భకు వచ్చిన పిదప "వైదర్భియొరున్ - వరియింపనంత ధర్మేతర చరితయే" అని భావించెను.

దమయంతి బాహుక వార్ష్ణేయులం జూచి వార్ష్ణేయుం సూత పుత్రుని గా గుర్తించి బాహుకు డెవడా ? యింత వికృతముగా నున్నాఁడే ? యితడు నలుఁ డెట్లగునా ? కానిచో వీనింజూచిన నా మదియేల సంతోషించుచున్నది. పర్ణాదునకుత్తరమిచ్చి యితనిని తెలిసికొనవలెనని కేశిని నంపినది. అదిపోయి మాయా మాటలు మాటాడి -

"అడవిలో వస్త్రార్థహారియై దయలేక ప్రాణేశ్వరుఁడు దన్నుబాసి చనిన నాటి వస్త్రార్థంబు నలినాక్షియిపుడు పరిధానముగఁబొంనుపటల మలినమగుచున్న తనువుతో, ననయంబు జడగొన్న యలకావలులతోడ నవనితలము శయనంబుగా ధర్మచారిణి దమయంతి యనఘవ్రతంబుల నాచరించుచున్న" దనును. ఆ మాటలు విని నలుఁడు మొగము త్రిప్పికొని కన్నీరు పెట్టుకొనును. ఆ సంగతి కేశినివచ్చి చెప్పినది. అంతటితోడ నూరుకొనక మఱియుఁ బరీక్షింపనెంచి నలుఁడు వంటచేయునపుడు చూచి రమ్మన్నది. దేవతల వరములు నలునకుంగలవు. అందగ్ని వరుణులు "వాని వలచినచోట నయనలోదకంబులు త్పాదింప" వరమిచ్చిరి. నలుఁడిప్పుడు వంటఁజేయ నమకట్టి తృణముష్టిఁగొని వీచిన నందగ్నియుదయించి కట్టెలు లేకుండనే వంటయగువఱకు మండుచుండెను. ఈ విషయము కేశినిచూచి వచ్చి చెప్పుటతోడనే యంతతో తృప్తిపడక నలుని పాకము రుచి యెఱిగియున్నదిగాన వాఁడువండిన నంజుళ్ళు తెప్పించి, తిని, రుచి వలన, నలుఁడేయని గ్రహించెను. అంతటితోడను నమ్మికయుఁ గారకుండక ప్రేమనుదాచి పెట్టిన దాగియుండదు. అందు బుత్రప్రేమ కట్టలు తెంచికొని ప్రవహించుచుండును. కానఁ గొడుకునుగూఁతును వానికడకు నంపి పరీక్షించెను. నలుఁడా పిల్లలఁగన్నీరు కార్చుచు నెత్తికొని కేశనితో "నాపిల్లలవలె నున్న నెత్తికొంటిని" అనెను. ఇన్నివిధముల నలుని దమయంతి పరీక్షించి నలునిగా

గ్రహించి తండ్రితోఁ జెప్పినది. అప్పుడును నేనచటి కేగవలయునా? అతఁడిచ్చటికి రావలయునా? ఏదిసముచిత మార్గమని దమయంతి తండ్రినడిగినది. ఎంత వినయమో చూడుడు. భీముఁడు ఋతుపర్ణునితోఁ జెప్పంగాబోలు, బాహుకుఁడే దమయంతి కడకువచ్చి యీమెం జూచెను. అప్పుడెట్లున్న దామె,

"చనుదెంచియందు దీనానన, నవిరళ పంక
మలిన నతగాత్ర,
దపఃస్విని, నతికృశ, దమయంతింగనియె న
లుండు దితబాష్పకణకలిత ముఖిన్."

దమయంతి యీ వేష మెవ్వరి గుండెలఁ గఱగింపదు? ఆమె నలునితో సిగ్గుభయముతోప నిట్లన్నది.

"సురనరులను మెచ్చకతను - వరియించిన
నన్నుఁ బుత్రవతి నే లొకో చె
చ్చెరవిడిచె, నాతనికి నిష్కారుణనకే నేమి
యెగ్గు కావించితినో."

ప్రాణసమానవైన నిన్ను విడువనన్న మాటల్ తేలమఱచెనోయని యేడ్చినది. నలుఁడు నీ రెండవ పెండ్లి చూడవచ్చితి ననగా, నిన్ను రప్పింప నట్లంటిమి,

"ఏనతి పాపభావమున నెగ్గుఁదలంపఁ దలంప
కొండుగా
నానతవైరి ! నీ యడుగులంటఁగ నొపుదు,
నట్లయైన న
న్నీనని నాప్తుఁ డీయనలుఁడీ మృగలాంఛనుఁ డీ
సురోత్తముల్
జాను వడంగ నాక్షణము చంపరె? కోపపరీత
చిత్తులై"

అన్నది. అపుడ వాయుభట్టారకుం డీమె పతివ్రత. ఈమె నొండాడకుము. మూ డేండ్లనుండియు నీమెను సూర్యచంద్రులు నేనును గాపాడుచుంటిమి. ఈమెను బరిగ్రహింపుమనెను. దేవతలు పుష్పవృష్టి కురిపించిరి. ఎంత శీలవతి దమయంతి !





# అగ్నిజ్వాలలు

మూలం :
శ్రీ భైరవ ప్రసాదగుప్త

అనువాదం :
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

శశికి తాను ఆకర్షణీయకపోతే భవిష్యాంధకారంలో రాలిన తారలా తన అస్తిత్వాన్ని సర్వనాశనం చేసికోడానికి సిద్ధపడాలి. పోనీ తన పినతల్లిని - పినతండ్రిని, శశిని, వీరి నందరిని విడిచి తన మార్గాన్ని - తాను సుగమం చేసికోగలశక్తి తనలో ఉందా? లేదు. తాను ఆ సామర్థ్యంలోపమే సర్వకష్టాల్నీ అనుభవించవలసి వస్తోంది. అయితే మరేం చెయ్యాలి?

రాధ వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమె సజలనేత్రాలను హృదయం, తిప్పి తిప్పి తుదకు జగదీశ్ మీద నిల్పింది. "అతడీసమయంలో తనకి సహాయం చేయగలడా? కాని యీ పరిస్థితుల్లో కాస్త సహాయ అనే ప్రసక్తివద్దు. ఇది యావత్ జీవితానికి సంబంధించిన ప్రశ్న. జగదీశ్ యింకా చదువు సాగిస్తున్న అతడు ఒక వ్యక్తిని భరించలేడు; సరికదా ఆ స్థితిలో తండ్రికి వ్యతిరేకంగా తానెటువంటిపనికూడా చేయలేడు. అదిగాక, ఒక అనాథ బాలికను పెండ్లిచేసికోమని ఏ డబ్బున్న తండ్రి అనుమతి యిస్తాడు? జగదీశ్ తనను ప్రేమిస్తున్నాడు. తాను స్వతంత్రుడు కాగానే నన్ను పెళ్ళి చేసికుంటానన్నాడు. ఈ పరిస్థితులలో రాధ అతనితో ఏమీ చెప్పలేను. కాని తన ప్రేమలత, మధ్యమార్గంలోనే వాడిపోతే? మరి ... ?

ఓసీ! ఒక్క కథేకదా తనకి ప్రశ్నగా నిల్చింది. తన జీవితంలో వందలకొలది కథలు వ్రాస్తుంది. పోని వాటిలో ఓ కథ పోయిందనుకుంటే? చాలా బాగుంటుంది. ఆమె ఆవేశంమీద - వివశత్వం, జయం సంపాదించింది. ఆ, ఆవేశమే రాధ వివేకాన్ని దూరంచేసింకూడా. ఇంత చిన్న విషయానికి తానెందు కింతగా బాధపడుతోంది? జీవన్మార్గ నిర్మాణానికి చేసేంత పెద్ద త్యాగంకూడాకాదే! కాని మరుక్షణంలో ఆమె హృదయాంతరాళంలో జగదీశ్ సంబంధమైన భావతరంగాలు లేచాయి. జగదీశ్ తనను ముఖ్యంగా ఆకర్షించి ప్రేమించడానికి తన కథయే ముఖ్య కారణం. ఆ సంగతి తనకి బాగా తెలుసు. ఒకవేళ అతనికి తన వాగ్దానం ప్రకారం కథ యివ్వకపోతే తననుగూర్చి మనోలా భావించవచ్చు. ఆ భావం మనసులోకిరాగా మరల ఆమె గట్టిగా నవ్వుకుంది. ప్రేమ కల్గడానికి మూలం కథ లేనా? ఛా! ఛా! కాదు. ఎంతమాత్రంకాదు. ప్రేమ అనేది - హృదయానికి హృదయానికీ! ఆత్మకీ - ఆత్మకీగల ఎడతెగని సంబంధం.

"అక్కా" అంటూ శశి తలపంచుకుని రాధ కెదురుగావచ్చినిలబడింది.

రాధ ప్రకృతిలోకి వచ్చింది. తన నిశ్చయాన్ని యిప్పుడు తేల్చుకోవాలనుకుంది. ఏదో చెప్పపోయింది. కాని "అక్కా నాకు భిక్షదొరికిపోయిందే" అంది.

"భిక్షా?" శశి పల్కులలోని ఆ భిక్ష ఏమిటో రాధకి అర్థంకాలేదు. కాని పాపం ఏంచేస్తుంది. ఆమె వివశయైపోయింది. "భిక్ష" అనే వంకతో నేడు శశి రాధ ప్రాణాలు తీయడానికైనా సంసిద్ధురాలైంది. రాధ ఏమీ మాటాడలేకపోయింది. కాని ... కా ... ... ఆమె మాట్లాడుతుంది. తప్పక మాట్లాడుతుంది. ఆనాడే చెప్పగలదు. ఇది భిక్షకాదు. ఇది ... ఇది.

"అక్కా మాట్లాడవేం? నీ ఉద్దేశ్యం ఏమిటో చెప్పు" గంభీరంగా ప్రశ్నించింది శశి.

కటువుగా నవ్వి పల్కింది రాధ "అదే. అర్ధమయింది ... అర్ధమయిందిలే."

---

"అయితే దొరికిపోతుంది" అని శశి యాచకునిలా చేతులు చాచింది.

రాధ లోన లోనం కంపించిపోతోంది. వశంలో ఉంచాలని ఎంత ప్రయత్నించినా హృదయంలోని అత్యంత ప్రియమైన వస్తువును తీసుకుపోతూన్నదా? అన్నట్లుంది ఆ కంపన. ఈ పని తను అనుకున్నంత తేలికైంది కాదని రాధకి క్షణంలో తెల్సింది.

"శుభస్య శీఘ్రం అన్నారు. అక్కా ఆలస్యం దేనికే?" శశి యింకా యాచనాసరిహద్దులలో నిలబడి పల్కింది.

ఈ సామర్థ్యమైన కడువ్యంగ్యం.రాధ హృదయాంతరాళాన్ని ఛేదించసాగింది. వివశత్వంలో మునిగిపోయిందామె. వీల్లేదు ... వీల్లేదు. అలా జరగడానికి ఎన్నటికీ వీల్లేదు. అనుకుంటూనే విధివశురాలై పిచ్చిదానిలా లేచి ఫేర్ తీసిన కథను డ్రాయరులోంచి తీసి శశి చేతుల్లో పెట్టింది. శశి హృదయంలో ఆనంద డోలికలు - రాధ తన హృదయాన్ని ఎవరో అంకుశం పుచ్చుకుని పొడుస్తోన్నట్లు బాధపడుతోంది.

శశి అప్పుడే రాధను కావలించుకుని - "అక్కా నువ్వెంత మంచిదానవు?" నిజానికి శశికి అక్క మంచిదే. ఆమెకు ఆ క్షణంలో ప్రపంచమంతా మంచిగానే కనుపించింది. "స్వార్ధపరుల ఆకాంక్షలు తీర్చే వ్యక్తులుంటే వారికి ప్రపంచమంతా మంచిగానే కనుపిస్తుంది" అని అనుకుంది రాధ. కాని ఆమె హృదయాంతరాళంలోని ఆవేశపూరితమైన ఆవేదన - ప్రశాంత నీలాకాశంలోని కారుమేఘ ప్రళయ గర్జనలా-నిర్మలనీలి సంద్రపదంలోని పెను తుఫానులా కల్లోలాన్ని రేకెత్తించసాగింది.

"వెళ్ళు శశీ! నాకు పనివుంది" అంటూ రాధ శశిని కౌగిలినుంచి తొలగింది.

లేడి దొరికినతోడేలులా ఉడాయించింది శశి. గాయపడినలేడి ఆరక్తపు మడుగులో ఎంతసేపు గిలగిలలాడి విలపించిందో ఎవరికి తెలియదు.

మరునాడాదివారం. శశి ఒక్కొక్క క్షణం యుగం లాగడుపుతోంది. చాల త్వరగా కథ ఫేర కాపీ తీసింది. అసామాన్యమైన పనికూడా ఆమెకు చాలా భారంగానే కనుపించింది. అనంతరం అలంకరించుకుని కథ జాగ్రత్తగా మడతపెట్టి Hand bag లో పెట్టింది. కారులో కూర్చుని క్షణంలో జగదీశ్ యిల్లు చేరింది.

అన్న, చెల్లీ యిద్దరూ మేడమీద పై గదిలో కూర్చుండి కేరమ్స్ ఆడుతున్నారు. ఇంతలో పనిమనిషి శశిని అక్కడకు తీసుకువచ్చింది. ఆమెను చూస్తూనే సుధ పల్కింది "రా శశీ! రా" అంటూనే దాసీదాన్ని టీ త్వరగా తెమ్మని ఆజ్ఞాపించింది.

జగదీశ్ అందుకున్నాడు – 'ఒంటరిగావచ్చారే? రాధదేవి రాలేదా?'

కూర్చుంటూ శశిపల్కింది_"నేను రాధనుకూడా తీసికురావాలనుకున్నాను. కాని ఆమె మళ్లో కథా రచనలో నిమగ్నమై ప్రకృతిని మరచింది."

జగదీశ్ ఆనందంగా పల్కాడు – "నిజంగా యింకోకథ వ్రాస్తున్నారా?" "అవునండి. యిప్పుడే వ్రాస్తోంది. నేను ఒక్కరాత్రిలో కథ వ్రాసేసాను. నామనోగతాభిప్రాయాలు తక్షణం వ్రాసేస్తాను. అందుకై నేనాట్టే శ్రమపడను!!" అంటూ Hand bag లోంచి తనురాత్రి వ్రాసిన కథ ఫేర్ కాపీ తీసి జగదీశ్ తో పల్కింది_"ఈ వేళ ఆదివారమని ఖాళీగా ఉంటారనీ నా కథచూస్తారనీ తలచాను. ఎలా ఉంటుందో మరి?"

"చూద్దాంలెండి. అంత తొందరెందుకూ?" అన్నాడు మామూలుగా జగదీశ్!

శశి సంధ్యకేసి చూసి పల్కింది. "అలా కాదండీ మీరిప్పుడే చూడాలండి. ఇది కాలేజీమాగ్జైన్ కు

ఇవ్వవచ్చునో కూడదో నాకు తెలియదు. మీరుచూసి మీ అభిప్రాయం చెబితే నాకు శాంతిగా ఉంటుంది!”

“అవును అన్నయ్యా పాపం ఎంత కష్టపడివ్రాసి ఉంటుందో? నువ్వేమూ! ......... !” హుషా రుగా యింకా మాట్లాడబోయింది సుధ.

“సరే యిప్పుడే చూస్తాలే” అంటూ జగదీశ్ కథమీద దృష్టిన్ని పోనిచ్చాడు. కథ ప్రారంభించిన మరుక్షణంనుంచీ హృదయాంతర్గతాను భూతులు ముఖకవళికలలో ప్రతిబింబంలా ఆను తున్నాయి. ఆ కథ చూస్తూనే ఈజీఛైర్‌లో (చతిల) కూర్చున్నాడు. మరుక్షణంలో ప్రకృతికీ తనకీ సంబంధంలేదన్నట్లు ఆ కథలో లీనమైపోయాడు.

కథ సమాప్తి చేస్తూ అసంకల్పితంగా ఆనందంగా అరచాడు. - “భేష్! భేష్! చాలా బాగుంది.” అంటూనే శశిదగ్గిరగావచ్చి కూర్చుని వర్ణవిహ్వలుడై పల్కాడు - “శశి దేవిగారూ - నిజంగా యీ కథ మీరేనా వ్రాసింది?”

“జగదీశ్‌గారూ! జైనేంద్రుని మొదటి కథ విని ప్రేమ్ చంద్ కూడా యిలానే ప్రశ్నించాడు. కాని నాకిది మొదటి కథ మాత్రంకాదని మీరు తెలుసుకోవాలి డజన్లకొద్దీ వ్రాసి పారేసాను. నాలోని లోపం ఏమిటంటే నేనెన్నడూ నా కథ ఎవరికీ చూపించను” గర్వంతో మెరిసేకళ్ళతో శశిస్వర్గంతో ఉన్నట్లు మాట్లాడుతోంది.

“కాని యీ కథలోనిభావ - శైలి - నిర్వహణ టెక్నిక్ అన్నీకూడా రాధాదేవి కథలలా ఉన్నాయి. అయినా ... అయినా ... ఈ కథ మాత్రం ఆకథలన్నిటి కంటె చాలా బాగుంది దానికి కారణం తెలియదు తెలియటంలేదు.” మంత్రముగ్ధుడిలా పల్కాడు జగదీశ్.

“ఇది శశి మీద నీకుండే సదభిప్రాయం అన్నయ్యా” అంది సుధ.

“కాదు. కాదు” ఆలోచించి పల్కింది శశి. జగదీశ్ బాబు మాటవాస్తవమైంది. “అసలు సంగతేమంటే నేనూ రాధాకూడా ఒకే గురువు దగ్గరకథా రచననేర్చుకున్నాం. అదీగాక మేం యిద్దరం 24 గంటలూ కలసి మెలసి ఉంటాం. అందుచే జగదీశ్ బాబు మారచనల్లోని భేదాన్ని గుర్తించలేక పోవడంలో ఆశ్చర్యంలేదు”

“బహుశా మీరు చెప్పేది నిజమే అయ్యిఉండాలి. ఈ ఆసరా! కథ చాలా గొప్పగా ఉంది. ఒక అనాథ బాలకి ఒక - ధనికకుటుంబంలో ఆధారం దొరుకుతుంది. ఈ అవకాశాన్ని సురక్షితంచేసికోడానికి ఆమె ఏమేంచెయ్యాలో? మొదలైన విషయాలున్నాయి. నిజంగా తీమ్ చాలాగొప్పగా ఉంది. భలే శశిదేవి! మీకు ఈ థీమ్ ఎలాతట్టిందో కదా?”

“మిస్టర్ జగదీశ్ బాబూ. థీమ్ మాటకేంకాని కలంలో సత్తా ఉన్నంతవరకూ ధూళికణంకూడా వజ్రమై మెరిసిపోతుంది” అంటూ నిట్టూర్చింది శశి.

“అయితే ఎదో ఒక అనాథ బాలిక జీవితానుభవాలకి మీరు సన్నిహితులై ఉండాలి.” అన్నాడు జగదీశ్.

“అయితే మీ అభిప్రాయానుసారం వేశ్యాచిత్రణచేసేవ్యక్తి వేశ్యలో లుడై ఉండాలన్నమాట తీక్ష్ణకల్పనా శక్తిగల కలానికి అసంభవ విషయాలు కన్పించవు.” అని శశి జగదీశ్ మానసికదృష్టిని మరల్చడానికని నవ్వసాగింది. సుధకూడా తాళం వేయసాగింది. చివరకు జగదీశ్ యిలా అన్నాడు.

“మీ కథ నిజంగా చాలా బాగుంది. ఇది కాలేజీ Magazine లో కవరుపేజీమీద ముఖచిత్రంతో సహా ముద్రించ బడుతుంది. రాధాదేవి యింకా ఎప్పుడిస్తుందో? చూద్దాం,” అన్నాడు జగదీశ్

“వ్రాస్తుండాలి మరి” అని శశి సుధవైపు చూస్తూ “ఇప్పుడు కొత్త మనస్సు ప్రశాంతంగా ఉందే! యిప్పుడైనా ఏదేనా ప్రోగ్రామ్ ఉందా?”

"మీరు మరోలా భావించ నంటే కథకు కానుకగా మీకొక సినిమా చూపించాలని ఉంది" అన్నాడు శశికేసి చూస్తూ జగదీశ్.

"ఇహనేం? చాలా బాగుంది. "అలాగే" అను శశి" అంది సుధ.

"నేను మీ మాట కాదంటానా?" అంది దొంగలా శశి జగదీశ్ కేసి చూస్తూ.

"Very good" "అయితే మేట్నీకి అరగంట మాత్రమే టైముంది" అన్నాడు వాచీ చూచి జగదీశ్.

"ఈలోగా కాస్త టీ త్రాగుదాం" అంది సుధ.

మరునాడు రాధ తన క్లాస్‌రూమ్ వైపు తలవంచుకుని పోతూ ఉంది. అంతలో జగదీశ్ వెళ్ళి కలుసుకున్నాడు.

"రాధాదేవీ! కథ తెచ్చారా?"

"లేదు" తలవంచుకునే పల్కింది రాధ.

"వ్రాస్తూ యున్నారా? ఇంకా పూర్తి కాలేదా!" ప్రశ్నించాడు జగదీశ్.

"మీకెలా తెలుసు" తడబడుతూ అడిగింది రాధ.

"శశిదేవిగారు చెప్పారు."

"ఓహో అదా! అవునవును వ్రాస్తున్నాను. కాని అది తయారుకాలేదు. బహుశా అది యింక తయారు కాదుకూడా." గాద్గధికంగా పల్కింది రాధ.

"అలా ఎందుకు చెయ్యాలి? మీరు ఓ కథ యివ్వక తప్పదు." ఆ మాటలు నొక్కి పల్కాడు జగదీశ్.

"నాకా కథ మానే అవకాశంలేదు అంటూ సంభాషించలేక ముందుకు సాగింది. కాని జగదీశ్ ఆమె కెదురుగా నిలబడి అన్నాడు - "కాని నాకు మీరు ఒక కథ యివ్వక తప్పదు. నేను ప్రొఫెసర్ గార్కి మాటకూడా యిచ్చాను."

"క్షమించాలి. నేను వివశురాల్ని - ఈ సారికి నన్ను మాత్రం వదిలివెయ్యండి. క్లాస్‌కి టైం అయిపోతోంది" అంటూ తప్పించుకుని రాధ జోరుగా వెళ్ళిపోయింది.

"ఓహో" అనుకుంటూండగా "జగదీశ్ బాబూ యివేళ సుధ రాలేదేం?" అన్న మాటలు వినిపించాయి. తలఎత్తిచూసాడు. ఎదురుగా శశి నిలబడి ఉంది.

"ఆమెకి కాస్త తలనొప్పిగా ఉంది" అన్నాడు జగదీశ్. "రాధాదేవి కథ యిచ్చిందా?" ఏలా ప్రశ్నించాలో సరిగ్గా అలానే ప్రశ్నించింది శశి.

"లేదు" ఉదాసీనంగా సమాధాన మిచ్చాడు జగదీశ్.

"ఏం. ఎందుకివ్వలేదూ? నిన్న రాత్రికి పూర్తిచేసిందే?" శశి పిడుగులా పల్కింది.

"ఆ! నిన్ననే పూర్తిచేసిందా? నాతో యింకా పూర్తి కాలేదని చెప్పిందే?"

"భేష్! తన కథను చదువుకుంటూ ఆనందాంబుధిలో తేలియాడుతోంది, ఒహో అదా సంగతి. తెల్సింది" అంది శశి క్రింది పెదవిని పైపంటితో నొక్కి కనుబొమ్మలు పైకిలేవదీస్తూ.

"ఏమిటీ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు జగదీశ్. "అయినా ఆమె అంత మంచి కథను మామూలు కాలేజీ పత్రికకు ఎందుకిస్తుంది. ఏదైనా గొప్ప పత్రికకు పంపుతుందికూడా. ఆ విషయమే నాతో రెండు మూడుసార్లు అందికూడా" అని శశి జగదీశ్ మనస్సు కలతపరిచింది.

"ఓహో - నేటికి తెల్సింది ఎటువంటి భావాలు కలదీ? రాధాదేవి! చాలా ఉత్తమురాలనుకుని ఉత్తిభ్రమలో పడ్డానన్నమాట. సరేలెండి శశిదేవీ! ఈ వేళ నా మనసేమీ బాగాలేదు. కాస్త కాఫీ త్రాగి వద్దాంరండి" అన్నాడు జగదీశ్.

(సశేషము)

# అమెరికాలో మహిళలకు ఉద్యోగాలు సాధించిపెట్టే స్త్రీ సేవా సంస్థ

## కెల్లీ బాలికా సేవా సంఘం కృషి

### శ్రీ కథ్లీన్ ఐర్స్

---

అమెరికాలో మహిళలకు ఒక రోజు మొదలుకొని ఒక సంవత్సరం అంతకు పైగానూ ఉండే తాత్కాలిక ఉద్యోగాలు చూచిపెట్టటంలో అవిరళంగా కృషి చేస్తున్న స్త్రీ సేవా సంస్థ ఒకటున్నది. దీని పేరు కెల్లీ బాలికా సేవా సంస్థ. 1946 లో రసెల్ కెల్లీ అనే వ్యాపార నిర్వహణ ప్రవీణులొకరు దీనిని నెలకొల్పారు.

డెట్రాయిట్ నగరంలో వాణిజ్య వేత్తలకు తమ కార్యాలయాలలో తాత్కాలికంగా పనిచేయగల మహిళలు అవసరమైనప్పుడు, సరఫరా చేయటానికై ఈ సంస్థ ఉద్దేశించబడింది. 1955 వ సంవత్సరం నాటికల్లా అది జాతీయ సంస్థగా అభివృద్ధి చెందింది. నేడు 81 నగరాలలో హానొలులూ నగరంతో కలుపుకొని - ఆ సంస్థ కార్యాలయాలు ఉన్నవి.

గత సంవత్సరం 23,000 వాణిజ్య వేత్తల కార్యాలయాలలో 50,000 పైగా కెల్లీ మహిళలు ఉద్యోగాలు చేశారు. ఆ గురుతర సేవా సంస్థ ప్రవర్ధమాన మవుతున్నది. 1958 అంతానికి 100 శాఖా కార్యాలయాలను స్థాపించాలని అనుకొంటున్నారు.

కెల్లీ మహిళలలో 18 మొదలుకొని 85 సంవత్సరాల వరకు వయస్సుగల వారున్నారు. "డెట్రాయిట్‌లో 85 సంవత్సరాల వృద్ధాంగన కాంప్టో మీటర్ ఆపరేటర్‌గా పనిచేస్తున్న"దని ఆ సంస్థ ఉద్యోగులలో ఒకరు చెప్పారు. "ఆమె తనపనిలో ఘటికురాలు. ఆ విషయం వివిధ సంస్థలవారికి తెలుసు. అందుకే ఆమెను పంపించవలసిందిగా కోరుతుంటారు. మా మహిళల్లో కెల్లా ఆమె వృద్ధ వయస్కురాలైనప్పటికీ, మాలో చాలమంది మధ్యవయస్కులూ, వృద్ధులూ ఉన్నారు. అరితేరిన మహిళలకందరికీ ఈ సంస్థ చక్కని అవకాశాలు కల్పిస్తున్నది" అని ఆ ఉద్యోగి తెలియ చేసింది.

కెల్లీ మహిళలలో హెచ్చుమంది 32 మొదలుకొని 46 సంవత్సరాల వయస్సులోనివారు. సగటున 37 ఏళ్లు వయస్సు కలిగిన వివాహితలు, ఇద్దరు పిల్లల తల్లులూ ఉన్నారు. పూర్వం పూర్తికాల ఉద్యోగం

చేసిన మహిళలు కొందరు, ఏదో కారణాన, ఇంటి పనులకు వీలుగా తాత్కాలిక ఉద్యోగాలు కావాలని కోరుకొంటుంటారు. వారికి తగిన ఉద్యోగాలు ఇప్పించటంలో, వారి అభిలాషలు, బాధ్యతలు అన్నీ ఆలోచించి తగిన ఉద్యోగం వచ్చేటట్టు చూస్తుంది ఈ సంస్థ.

సాధారణంగా ఒక కెల్లి మహిళ ఒక సంవత్సర కాలంలో ఐదు వేర్వేరు సంస్థల్లో పని చేసి ఉంటుంది.

వివిధ భావాలుగల మహిళలు ఈ కెల్లీ మహిళా సేవా సంస్థలో చేరుతుంటారు. వారిలో చాలామంది ఏదో ప్రత్యేక అవసరానికి అదనంగా డబ్బును సంపాదించుకొందామని వస్తారు. ఆ డబ్బు కుటుంబం క్రింద వెచ్చించేవారూ కొందరు ఉంటారు. ఉదాహరణకు ఒక మహిళకు తన భర్త అస్వస్థుడు కావడం మూలంగా, ఇల్లువిడిచి పూర్తికాలం ఆఫీసులో పనిచేయ వీలులేక ఈ సంస్థద్వారా అడపాతడపా పనిచేస్తూ కుటుంబపోషణభారం కొంతవరకు భరించ వీలయింది. మరొక మహిళకు ఉదయం నుంచి సాయంత్రంవరకూ పనిచేయగల దార్ఢ్యం ఉండకపోవచ్చు. అటువంటప్పుడు ఈ సంస్థ శరణ్యం అవుతుంటుంది. "నా జీవితమంతా ఉద్యోగంచేశాను, ఒక ఉద్యోగంనుంచి మరొక ఉద్యోగానికి మారుతూ ఉన్నప్పుడల్లా నాకు నూతనోత్సాహం కలుగుతూ ఉండేది" అని ఒక కెల్లీ మహిళ తాత్కాలిక ఉద్యోగాలంటే తనకు ఎందుకు అంత అభిలాషో తెలియచెప్పింది.

కెల్లీ మహిళలు చేయనిపని అంటూ లేదు. టైపిస్టు, స్టెనోగ్రాఫరు బుక్ కీపరు, స్టాటిస్టికల్ క్లర్కు, ఆఫీస్ మెషిన్ ఆపరేటరు, సాధారణ గుమాస్తా, రిసెప్షనిస్టు, వగైరా వివిధ రకాల ఉద్యోగాలు వారు నిర్వహిస్తుంటారు.

భాషా కోవిదులైనవారూ, ప్రత్యేక చదువులు చదివినవారు, ఇంటర్ప్రిటర్స (దుబాసీలు)గానూ, లేదా రాయబార కార్యాలయాలలోనూ పనిచేస్తారు.

ఈ మహిళలలో చాలామంది ప్రపంచంలో పలుదేశాలనుంచి వచ్చినవారు.

సాధారణంగా ఈ మహిళలందరూ ఆఫీసు ఉద్యోగాలు నిర్వహిస్తున్నప్పటికీ, ప్రత్యేక విధులు నిర్వహించేవారుకూడా కొందరు లేకపోలేదు. ఉదాహరణకు, ఒక ఇంజనీయర్ కళాశాల విద్యార్థిని, ఒక భూభౌతిక వేదశాల అబ్జర్వేటరీలో కృత్రిమ ఉపగ్రహ గమనజాడలు పరిశీలించేటందుకు నియమించబడింది.

కెల్లీ కార్యక్రమాలకు పొదుపు, సౌకర్యం, ప్రాతిపదికలుగా ఉంటవి. కెల్లీ సేవాసంస్థ మూలంగా, ఖామందులకు తాత్కాలిక ఉద్యోగాలకోసం ఇంట

(329 వ పేజి చూడుడు)

# విశ్వసుందరి

శ్రీ K. V. సుబ్బారావు బి. ఏ.



నీలవేణీ నగరాన్ని నీలవదనుడనే రాజు పరిపాలించుచుండెను. ఆరాజు ప్రజలను కన్నబిడ్డలవలె ప్రేమించేవాడు. అతనిభార్య మణికర్ణిక. నీలవదనుడికి రెండవభార్య మణికర్ణిక. మొదటిభార్య సత్యవతి పోయినతరువాత రెండవ వివాహంచేసుకోకూడదని గట్టిపట్టు పట్టుకూర్చున్నాడు. ఎందుకంటే మొదటి భార్య పోతూపోతూ చిన్నారిబాలను తన చేతుల్లో పెట్టిపోయింది, అందుకని వివాహంచేసుకుంటే, ఆవిడ తన చిన్నారిబాల "విశ్వసుందరి"ని సరిగాచూస్తుందో, సహజంగా సవతల్లి ప్రవర్తించినట్లు ప్రవర్తిస్తుందేమో, అని భయపడ్డాడు. కాని చివరకు పరిస్థితులకు లోబడి మంత్రులసలహాపై మణికర్ణికను పెండ్లాడాడు.

అనుకున్నంతా అయింది. కాపరానికివచ్చిన పదిరోజుల్లోనే తేలిపోయింది మణికర్ణిక పట్టిజిత్తులమారి దని. విశ్వసుందరిని ఆడిపోసుకోవటం మొదలెట్టింది. ఇదంతాచూచి రాజు తనలోతానే కుమిలిపోసాగినాడు. అయినా ఏంచేస్తాడు? తాళికట్టింతర్వాత సర్వాధికారాలూ రాకండాపోతాయా!

కాలచక్రంతో రోజులు దొర్లిపోతున్నయ్. విశ్వసుందరి నాటానాటా పెరిగి పెద్దమనిషైంది. ఆమె రూపంలో రతీదేవినీ, సుకుమారంలో పార్వతీదేవినీ, విద్యలో సరస్వతినీ, గాంభీర్యంలో లక్ష్మినీ మించిపోయింది. అటువంటి అందాలబాలను వెర్రిబాగులవాడయిన తనతమ్ముడికిచ్చిచేయాలని మణికర్ణికవాదం. దేవికోరిన అన్నికోరికలు తీర్చాడు కాని మాస్తూమాస్తూ వెర్రిబాగులవాడికి తన కూతుర్ని ఇవ్వటానికి సుతారామూ వప్పుకోలేదు మహారాజు. మహారాజు తనమాట నిరాకరించాడని మండిపడింది, ఇంకా ఎన్నో ఎత్తులువేసింది. కాని మహారాజు ముందవి పారలేదు. విశ్వసుందరిని తనతమ్ముడికి కాకుండా ఇతరరాజకుమారునికిచ్చి వివాహం చేస్తుంటే తానుసహించలేదు. ఏవిధంగానూ రాజు బోల్తాపడకపోయేసరికి రాణీ ఒకపన్నుగడపన్నింది. అదేమిటీ అంటే విశ్వసుందరిని మాయోపాయం చేసి చంపటం. తనపన్నుగడకు ఎంతగానో మురిసిపోయింది మనసులోనే.

ఆరోజు మామూలుగా రాణీమందిరంలోనికి వచ్చాడురాజు. రాణి చిరునవ్వుతో స్వాగతమిచ్చింది. ఈ చిరునవ్వు విషపూరితమైనదని మహారాజుకు తెలియకకాదు అయినా నాటక మెంతవరకు ఆడుతుందో చూద్దామని తానూ వేచివున్నాడు.

"మహారాజా!" అంది ప్రేమనొలికిస్తూ

"ఏమిటి?" అన్నాడు.

"విశ్వసుందరి పెండ్లి మీ యిష్టప్రకారం జరగటానికే వప్పుకుంటాను. మీరు వెళ్ళింతర్వాత తీవ్రంగా నేనూ ఆలోచించాను. చాలా సేపు యోచించి యోచించి మన అందాలరాకుమారిని ఆ వెర్రినాగన్నకిచ్చి చేయటమంత తెలివితక్కువ లేదు అని నిశ్చయించుకొని నా మనస్సు మార్చుకున్నాను. ఇక మీ యిష్టం" అంది.

"నిజంగానా మహారాణీ!" ఒక్కసారి ఆశ్చర్యపోయాడు.

"మీమీద వట్టువేసి చెపుతున్నాను!" అంది నంగనాచిలా.

"అలాఅయితే దేవీ మనఅమ్మాయికి తగినవరుడు ఏదేశరాజకుమారుడు తగునంటావ్. అంగ, వంగ,

కళింగ, నేపాళ, రాజ్యాలనేకం వున్నాయ్. మనమంత్రికి అమ్మాయి చిత్రాన్నిచ్చి పంపుదాం సరేనా!" అన్నాడు,

"ప్చ్!" అని పెదవి విరిచిందిరాణీ – "మీ పద్ధతి నాకేమాత్రం బాగలేదు. మనమే స్వయంవరం ఏర్పాటుచేసి రాజాధిరాజులకు ఆహ్వానాలు పంపుదాం. ఆ స్వయంవరంలో అమ్మాయికినచ్చినవాడిని ఎన్నుకుంటుంది!" అంది.

ఇంతవరకూ బాగానేవుంది అని అనుకుని, రాజు సరేనన్నాడు. "కాని మహారాజా ఒకషరతు అదేమంతపెద్ద సమస్యకాదు. బహుస్వల్పమయింది. మన అమ్మాయి సామాన్యుడిని వరించటం మీకూ నాకుయిష్టంలేదు, అసమాన్యుడయినవాడూ, బహుబలసంపన్నుడూ, ధైర్యశాలీ, అందగాడూ కావాలి. అటువంటి లక్షణ సంపన్నుని కోసమే నేనీషరతుపెడుతున్నాను. దీనికి మీ అంగీకారముద్ర కావాలి -" అన్నది.

"ఏమిటీ నీషరతూ!"ఆశ్చర్యపోయి అన్నాడు.

"అట్టే ఏమీలేదు. రేపు స్వయంవరానికి బహుబలసంపన్నులనేకమంది వస్తారుకదా; సభామధ్యంలోకి నేను వచ్చి మూడువస్తువుల్ని కోరతాను. నేను కోరిన ఆ మూడువస్తువులనూతెచ్చి పెట్టటానికి ఏ రాజకుమారుడయితే ముందుకు వచ్చి వాటిని సాధించుకువస్తాడో ఆ ధైర్యశాలికి మన అమ్మాయినిచ్చి కళ్యాణం చేద్దాం"సరేనా! అంది.

"బాగానేవుంది నీ గొంతెమ్మకోర్కెలు నీ కోర్కెలుతీర్చేవాడు ఇహాయీ లోకంలో పుట్టడు" గొణుకున్నాడు.

"అయితే మహారాజా! మన అమ్మాయిని ఒక పిరికి పందకిచ్చి చేయాలనామీవుద్దేశ్యం. నా మూడు వస్తువులనీతెచ్చిపెట్టనివాడు ఒట్టి పిరికిపంద. అటువంటి పిరికిపందకు ..."

రాజుకు స్వాభిమానంమీద గొడ్డలితో కొట్టినట్లయి, "ఆగు!" అని గర్జించాడు. "నీయిష్టప్రకారమేకానియ్యి" అని వెళ్లిపోయాడు.

"మణికర్ణిక తన పాచిక పారినందుకు ఎంతగానో పొంగిపోయింది. తను కోరిన ఆ మూడు వస్తువుల్ని సాధించటం సాధారణమానవునికి అసాధ్యమయిన పని. ఒకవేళ మూర్ఖించి సాధించుదామనిపోయినా దారుణమైన ప్రమాదాలలోనుంచి తప్పుకురావటం అసాధ్యం-అయినా వాడు గడువులోగా రావాలి కదా"! అని పొంగిపోయింది.

ఇంతలో రాజు అక్కడికి వచ్చాడు.

"మహారాజా! నేను పెట్టిన గడువులోగా మూడు వస్తువులను సాధించుదామని పోయినవాడు తిరిగి రాకపోయినట్లయితే, గడువు రోజు దాటిన మరునాడే విశ్వసుందరిని నా తమ్ముడికిచ్చి పెండ్లి చెయ్యాలి. ఈ షరతుక్కూడా మీరు ఒప్పుకోవాలి" అంది.

రాజు విధిలేక "సరే"నని బయటకు వెళ్ళిపోయాడు.

అనుకొన్నట్లు స్వయంవరసభ ఏర్పాటయింది. రాజాధిరాజు లనేకులు దూరదేశాలనుండికూడా వచ్చారు. ఎవరికివారు ఆ అందాల భరిణను తన దానినిగా చేసుకోవలెనని వువ్విళ్లూరుతున్నారు.

మణికర్ణిక విశ్వసుందరిని తీసుకుని సభా భవనంలోకి వచ్చింది. విశ్వసుందరి ఒకమారు సభనంతా కలియజూచి సింహాసనా ఉపవిష్టురాలయింది.

మణికర్ణిక సభనంతా తిలకించింది – "రాజాధిరాజులంతా శ్రమపడి దూరదేశాలనుంచికూడా వచ్చినట్లున్నారు. వారందరికి నా కృతజ్ఞత. మీలో ప్రతిఒక్కరికికూడా విశ్వసుందరిని పెండ్లిచేసుకోవలెననే అభిలాషలేకపోలేదు. నా కుమార్తె అంత అందాలరాశియై మీ హృదయపీఠాల్లో అలంకరించినందుకు ఆమెకు మాతనయిన నేనెంతో గర్విస్తున్నాను. సభాసదులందరికీ ఒక విషయం తునవిచేసు

కుంటున్నాను. నా కుమార్తెను వివాహంచేసుకొనటానికి ముందుకువచ్చే ధీరుడు ముందుగా నేను కోరే మూడు వస్తువులను నిర్ణయించిన గడువులోగా తీసుకురావాలి. అలా నేను కోరే మూడు వస్తువుల్ని సాధించటానికి వెనుదీయని మగవాడెవడయినావుంటే ముందుకు రండి! ఆ ధీరుడికి మొట్టమొదట సాధించవలసిన వస్తువేదో చెప్పుతాను!" అంది.

మహారాణి ఆ మూడు వస్తువుల విషయం ఎత్తేసరికి ఎవరికివారు చల్లగా జారుకున్నారు. సభ మొత్తం ఖాళీ అయింది. కాని ఆ మూల ఎవరో యువకుడొకడు లేచి రాణి ముందుకువచ్చి నమస్కరించి - "మహారాణీ! నీవు కోరే వస్తువులలో మొదటిదేదో చెప్పు సాధించుకువస్తాను" అన్నాడు నిర్భయంగా.

ఆ యువకుని ధైర్యసాహసానికి సభ మొత్తం ఆశ్చర్యపోయింది. రాజు వింతపోయాడు. విశ్వసుందరి ఆత్రంగా ఆ యువకుని మోములోకి తొంగి చూసింది. మహారాణి తొణకలేదు. "నీకేమయినా ప్రాణాలమీద ఆశవుందా!" అంది ఆశ్చర్యం నటిస్తూ.

"ఆశ నిరాశల విషయం మీకనవసరం. వేగిరం మీ మొదటి వస్తువుపేరు చెప్పండి." అన్నాడు యువకుడు.

"సరే చెప్పుతాను విను - ఇక్కడికి దక్షిణంగా పదిక్రోసుల దూరంలో ఒక విచిత్ర వృక్షంవుంది. ఆ వృక్షాన్ని ఆధారంగా తీసుకొని వారంరోజులలోగా మాణిక్యహారాన్ని సాధించుకొని రావాలి. గడువు దాటిన తర్వాత వచ్చావో ... శిరచ్ఛేదం!"

"అది మామూలేగా!" అని నవ్వుకుంటూ ఒక చూపు విశ్వసుందరివైపు విసిరాడు. ఆమె సిగ్గుతో తల వంచుకుంది. రాణి అదిరిపడింది. "అయినా వీడు అన్ని గండాలుదాటి, ఆ గడువులోగా బయటపడినప్పుడు మాటకదా" అ మనసులోనే సమాధానం చెప్పుకుంది. రాజు మాత్రం ఆ యువకుని ధైర్యానికి అబ్బురపడి - "అబ్బాయ్, నీ పేరేమిటోయ్ తెలుసుకోవచ్చా? - " అన్నాడు.

"నా పేరా, భువనసుందర్! సెలవిప్పించండి" అని గిరుక్కున వెనక్కు తిరిగాడు.

## 2

రాజభవనం దాటినవెనుక భువనసుందర్ దక్షిణ దిశగా బయలుదేరాడు. శ్రమ అయినా భరించి పదిక్రోసుల దూరంనడిచి చివరకు ఒక పెద్ద ఎడారిలో విచిత్రవృక్షం కనిపించింది. ఆ చెట్టును గురించి విచిత్రపడటానికి రెండే రెండు కారణాలున్నట్లు కనిపెట్టాడు. ఎడారిలో అంత పెద్ద వృక్షంవుండి ఆకులతో పూలతో శోభిల్లుతూ వుండటం; రెండవది మరీ విచిత్రమయినది. అదేమిటీ అంటె ఆ చెట్టుకు కొమ్మలు నాలుగేవున్నయ్. నాలుగు కొమ్మలు నాలుగు దిక్కులకు వ్యాపించివున్నయ్. అందులోను ఒక కొమ్మ ఆకాశానికి వ్యాపించివుంది. ఇది మరీ విచిత్రంగావుంది.

సరే ఏమయినాసరే దీనివిచిత్రమేమిటో పరిశోధించినదాకా వెనుకంజ వేయకూడదనుకున్నాడు. వెంటనే నడుముకు కండువాబిగించి చెట్టు ఎక్కాడు. నాలుగుకొమ్మలనూ నిశితంగా పరిశీలించి ఆకాశంవైపుకు చొచ్చుకుపోయిన కొమ్మ నెక్కిసాగిపోసాగాడు. అలా ఆ కొమ్మవైపు ఎంతదూరం పోయినా అంతు దొరకటంలేదు. పైగా నిముష నిముషానికి కొమ్మపరిమాణం సన్నగిలసాగింది. అయినా ధైర్యంతో సన్నటికొమ్మను పట్టుకొని ముందుకుపోసాగాడు. కాని కొమ్మ మరీ సన్నమయింది. చేతులు చెమటపట్టిపోయి పట్టుకూడా అనటంలేదు. అలానే మూర్ఛించి కొమ్మవెంట ఆకాశపుటంచులవరకూ వచ్చేశాడు. అయితే యింతలో దురదృష్టవశాత్తు కొమ్మవిరిగిపోయింది. విరిగిన కొమ్మతోపాటు భువనసుందర్ కూడా క్రిందపడిపోసాగాడు.

ఇంతలో ఒక గంధర్వకన్య ఆకాశమార్గాన గంధర్వలోకానికి వెళుతూ క్రిందపడిపోతూన్న ఆయువకుని చూచి కెవ్వునకేక వేసింది. గంధర్వ కన్యకేకను చలికత్తె

అదిరిపడి అటుచూసింది. "అయ్యోపాపం! ఆ యువకుడు కొమ్మవిరిగి క్రిందపడిపోతున్నాడు. ఇంకా కొంచెంసేపాగితే అతడు కొండమీదపడి తలబ్రద్దలు కావటం తథ్యం" అంది చెలికత్తె.

"పద అటువైపు మనవిమానంత్రిప్పు ఆయువకుని రక్షిద్దాం" అంది చెలికత్తె. ఒక్ మనివిమానం అటు పోనిచ్చింది. ఇంతలో యువకుడు సరాసరివచ్చి గంధర్వకన్య విమానంలో పడిపోయాడు.

స్మృతితప్పిపోయిన ఆ యువకుని తీసుకొని గంధర్వలోకానికి బయలుదేరింది. "నెమ్మదిగా ఆ యువకుని మోహంమీద చన్నీళ్లుచల్లింది. భువనసుందర్ మెలుకువవచ్చి కళ్లువిప్పాడు, ఎదురుగా అతిలోకసుందరి. "ఎవరుమీరు, నేను ఇక్కడకు ఎలా వచ్చాను?" అన్నాడాశ్చర్యంగా.

గంధర్వకన్య నవ్వుతూ సమాధానం చెప్పింది. ఆమె అతడిని రక్షించినవిధమంతా చెప్పేసరికి ఆశ్చర్యపోయాడు.

"నిజంగా మీ ఋణం వేయిజన్మలకయినా తీర్చుకోలేను" అన్నాడు చేతులు జోడించి.

"అయితే మీపేరేమిటి" అని అడిగింది గంధర్వకన్య.

"భువనసుందర్!" జవాబిచ్చాడు.

"ఓహో అల్లాగా — అయితే తమరు ఏ పనిమీద యిలా బయలుదేరారూ!"

భువనసుందర్ అసలు తనుబయలుదేరిన విషయం యావత్తూ పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

గంధర్వకన్య మందహాసంచేసి ఒళ్లువిరిచింది వయ్యారంగా.

"మాణిక్యహారం దొరకటం కష్టమయినపనే" అంది.

"అయితే ఇక హారం లభింపదా నేనా మణికర్ణిక ఖడ్గానికి బలి కావాలసిందేనా. నా వీరత్వం యిలా మట్టిపాలు కావలసిందేనా" అన్నాడు. "భయపడకయ్యా భువనసుందర్! మాణిక్యహారం లభించాలంటే దానికోసం ఎంతయినా త్యాగంచెయ్యాలి." అంది.

"చెప్పు ఏత్యాగమయినా చేస్తాను. నా ప్రాణం కావాలా? తీసుకో" అంటూ కత్తితీశాడు.

ఆమె భువనసుందర్ చేతిని పట్టుకొని — "ఆవేశపడకయ్యా యువకుడా! పద చేయవలసిన త్యాగమేమిటో కండ్లారా నీవే చూద్దుగాని" అని భువనసుందర్‌ను వెంటబెట్టుకొని మేడచివరి అంతస్తుపై మెట్ల దగ్గరకువచ్చింది.

"క్రిందచూడు భువనసుందర్, సలసలా కాగిపోతున్న నూనెబావినిచూశావా. వెనుకముందాలోచించకుండా నీఅభీష్టాన్ని తలచుకొని అందులోకి దూకు. ప్రాణాలమీద తీపిచేత ఒకసారి వెనక్కుతగ్గి తిరిగిదూకావో చచ్చిపూరుకుంటావ్." అంది.

"సరే నా అభీష్టంకోసం నేనేత్యాగమయినా చేస్తాను" అని కండువా నడుముకుబిగించి బావిలోకి దూకాడు భువనసుందర్.

భువనసుందర్ కండ్లు తెరచిచూచేసరికి తాను ఓ నది ఒడ్డున ఇసుకతిన్నెమీద పడివున్నాడు. ఆ సరస్సు ఎంతో విచిత్రమయింది. పంచరంగుల జలంతో రమణీయంగా ప్రకాశిస్తోంది. ఆ సరస్సు అందానికి ముగ్ధుడయి అలానే కూర్చుండిపోయాడు. ఇలా చూస్తుండగా వున్నట్లుండి సరస్సు అటుగా నుండి ఒకపద్మం బయటకొచ్చింది. ఆ పంచవన్నెల పద్మంలో గాంధర్వకన్య కూర్చునివుంది. ఆమె మాణిక్యహారం మెరిసిపోతోంది. పద్మంసరస్సు ఒడ్డుకువచ్చింది.

(సశేషము)

# పేక మేడ

శ్రీ భరణి

---

'బాబు'కు తలంటి పోసి చంకనెత్తుకొని రాజ్యం గబగబా మేడమీదికి వచ్చింది. "ఏమండోయి బాబు భలే అసాధ్యుడిలా ఉన్నాడు ... అన్నీ మీ పోలికలే వాడి మాటలు వింటుంటే ... అబ్బా .. అబ్బా ఎంత కొంటె వెధవ" అంది గుక్క తిప్పుకోకుండా. పేపర్ కిందపారేసి బాబు చిరునవ్వు ఆనందిస్తూ ... "ఏమంటున్నాడు బాబు" అన్నాను

"ఏముంది—కాబోయే వకీలు గారి సుపుత్రుడుగా" అంది రాజ్యం గుబురుగా పెరిగిన బాబు గిరిజాలను తుడుస్తూ.

"అసలు విషయం చెప్పు రాజ్యం"

"ఏముంది మీ మాదిరే క్రాస్ పరీక్షలు చేస్తూంటాడు"

"ప్రస్తుతం యే విషయంలో?"

బాబుకుబొట్టూ, కాటకా పెడ్తూయిలా అన్నాడు. "బిస్కత్తు పెట్టమ్మా" అన్నాడు. "లేదు నాయినా బిస్కత్తులు ఎలుక ఎత్తుకు పోయింది; రేపు కొంటాములే" అన్నా "మూత పెట్టావుగా" అన్నాడు "అవును గట్టిగానే మూత పెట్టాను" అని అన్నాను. 'మరెలా తీసింటుందమ్మా ఎలుక?' 'అది తెలియటంలేదు బాబు' అని అంటే అంటాడు కదా "ఎలుకకి చేతులు లేవు... గట్టిగా ఉన్న మూత ముక్కుతో తీయటానికి వీలుకాదు .. ఆ ... తెలిసింది తెలిసింది ... తోకతో తీసింటుంది కదూ" . అని అంటున్నాడు అంది రాజ్యం ఉబికి వస్తూన్న సంతోషం కప్పిపుచ్చుకొంటూ.

"సమాధానం ఎలా ఉంది"

'భలేగా వుంది'

"అవును మరి లాయర్ గారి కొడుకుగా"

♦ ♦ ♦

"పరీక్షలు ఎలా వ్రాశారు?"

'దంచేశాను డియర్ !'

'అయితే జూన్ నుంచి ప్రాక్టీసు పెడ్తారా'?

"ప్రాక్టీసు సంగతి తరువాత ముందు రిజల్ట్సు రావాలిగా"?

"మీరు ప్యాసు కాకపోతే మరెవరు ప్యాసవుతారండి?"

"నువ్వు పిచ్చిదానివి"

"అవును అందుకనేగా మీకంత ఎగతాళి" అని చీర సర్దుకుంటూ అద్దం ముందు, నిలబడి "నా మనసులో చిన్న కోరిక ఒకటి ఉన్నదండి" అన్నది.

"కోరికా ఎలాంటిది ... కోరికను

సంబంధించింది ఈ భువిలో దొరుకు తుందా?''

''అబ్బా మీదంతా చోద్యంగా ఉంది. నేనేం .. అసంభరాన్ని కోర టానికి...!''

''అలా ఆగిపోయినావేం పూర్తిచెయ్యి''

వోరగా, కొంటెగా నా కళ్ళలోకి చూస్తూ ''మీరు ప్రాక్టీసు పెట్టగానే, నేనూ, మీరు మీనల్లకోటుతో, బాబు ఫోటో తీయించుకోవాలి సుమా''!

''బస్ అంతేనా .... పారిజాతాన్ని కోరుతున్నావనుకున్నాను''

''మీరు వకీలవుతే మన బాబు ఏమవు తాడండీ?''

''మాతృత్వం వహించిన దానివి అదీ నువ్వే చెప్పు''

''హైకోర్టు జెడ్జి''

''ముమ్మాటికీ కాదు రాజ్యం . వాడు సుప్రీంకోర్టు జడ్జి అవాల్సిందే''

''అబ్బా మాబాబు సుప్రీంకోర్టు జడ్జి'' అని అంటూ గట్టిగా ముద్దు పెట్టుకొంది; బాబును'

♦ ♦ ♦

''పరీక్షఫలితాలు రేపు తెలుస్తాయి'' తెల్సినప్పటినుండే అర్థంలేని ఆదుర్దా, భయం, ఆందోళన ఒక్కుమ్మడిగా హృద యంలో చెలరేగినాయి. ఆ రాత్రి కల్లో ప్రముఖ వకీళ్లు, కోర్టులు, నల్లకోట్లు, పుస్త కాలు గిర్రున స్మృతిపథంలో తిరగటం అదే నా తొలిసారి ''పరీక్షరిజల్ట్సు'' హిస్టీరి యానుభవం అంటే నమ్మండి! రేపు అరుణోదయం కాగానే యెలాంటివార్త వింటాను! యెలాంటి వాతావరణంలో ఉంటాను, యెలాంటి అనుభూతులను! చవి చూస్తాను ... ఈ ఆలోచనలతో మెదడు వేడెక్కింది. నిశిరాత్రి ఘడియలు దొర్లి పోయినయ్.

♦ ♦ ♦

నేకప్పుకొన్న దుప్పటిలాగేస్తూ ''సుప్రభాతం ... సుస్వాగతం ... లేవండి వకీలుగారు'' అంది శ్రీమతి. నేను గుడ్లప్ప చెప్పి నిశ్చేష్టుడయి చూస్తూంటే ''మీరు ప్యాసయినారు ... లేవండి వకీలుగారు'' అంది మళ్ళీ.

పక, పక నవ్వులు, సిరి, సిరి నవ్వులతో గది పలుసార్లు ప్రతిధ్వనించింది. ఆ రోజు సాయంత్రం నేను, శ్రీమతి, బాబు కరధు ల్లేని ఆనందాన్ని అనుభవించాం. జీవి తంలో నూతన ఘట్టం ప్రారంభమైంది. ఇప్పుడే నేను వకీలును-బాబు జడ్జి, శ్రీమతి వకీలుభార్య.

♦ ♦ ♦

వారం రోజులు దొర్లిపోయినయ్.

ప్రాక్టీసు విషయం ఆలోచిస్తున్నాను. రాజ్యం తన సలహాలను వొలకపోస్తోంది.

"పోస్టు ... పోస్టు ... "

'మనియార్డర్ వచ్చినట్టుంది.. తీసుకో' అన్నాను. గుమ్మంలోకి వెళ్ళివచ్చి "మని యార్డరు కాదు ... నా తలకాయ కాదు... ఏదో కవరు" అని ఠకీసరి కవరు చేతి కిచ్చింది.

కవరుచించి సన్నటి కాగితాన్ని లాగాను.

"రాజ్యం ... రాజ్యం ... "

"ఏమిటండి ?"

"పరీక్ష పోయింది"

'ఆ ... ఆ ... యేమిటండి మీరనేది ?'

"అవును పరీక్ష పోయింది. పొరపాటున నంబరు పత్రికలో ప్రకటితమైందని విశ్వ విద్యాలయంవారు వ్రాశారు" అన్నాను.

"ఏడవలేకపోయూరు" ... జలజల కన్నీటిబొట్లు కాటుక కళ్ళనుండి రాలి నయ్. మా యిద్దరి పాలిపోయిన మొహా లను మా జడ్జి ... కాదు, మా బాబు చూస్తూ నిలబడ్డాడు.

---



---

# "కరణంగారమ్మాయి"

శ్రీమతి మునిపల్లె సరస్వతి

నా బాల్యంలోనే అమ్మా నాన్నా చాటయ్యారు. కాబట్టే మేనమామ చేతిలోపడి మాడిపోవలసి వచ్చింది. "కన్నతల్లి కంటే ఘనమైనదేదయా!" అనే పదం నామదిలో కదిలాడగానే పూరిబయట పాడుపడ్డ దేవళానికి కాళ్లులాక్కుపోయేవి. నే నేడు చెట్టును పీపుదానించి రెండు వేడి నిట్టూర్పులిడిచేవాణ్ణి. ఇది ప్రతిరోజూ జరుగుతోన్న నా దినచర్య.

తల్లి దండ్రులు కరువయ్యాక మొగసాలుపైనా నాల్గక్షరాలబ్బినా మాయమమతులు మరుగుబడవు. ఇద్దర్నీ చాటుచేసుకున్న నాలాంటి దౌర్భాగ్యనికి మేనమామకు వెట్టిచాకిరి చేయటమే శాస్తి.

ఈ రోజుల్లో యస్. యస్. యల్. సి. పాసయిన కుర్రాడు చేత డిటెక్టివ్ బట్టి, కాబూలీలాగు, బెంగాలీ లాల్చీలలో తిరుగుతూంటే, యస్. యస్. యల్. సి. పాసయిన నేను, నొష్ట కుంకుమ, కులగోత్రాలను దెల్పు నా పిలకా, ... వైదీకినని తెలుసుకోడానికేలాంటి అభ్యంతరము లేదు.

సెలవులవల్లో మామయ్యను కాలేజీకి పంపమని కాళ్ళవేళ్ళాబడి వేడుకొన్నాను, మొండిమామయ్య 'ససేమిరా' అన్నాడు. "వంటింటిలోకి దూరి అక్కయ్య కారోజు చేదోడు వాదోడుగా వంగ ముక్కలుగూడా తరిగాను. ఆమెగూడా నా భవిష్యత్తును రవ్వంతగూడా వాంఛించినట్లు లేదు." "అంతా మీమామయ్యదేగా పెత్తనం!" అని నొక్కి చెప్పింది.

అరడజను సంతానంతో తులతూగుతూ నిత్య కల్యాణం పచ్చతోరణంగావుండే మామామగారి పూరిల్లు—మూషికరాజ పరిపాలనలో అస్వతంత్రంగా వుండి కప్పం ధాన్యరాసులు చెల్లిస్తూన్న మామగార్ని ఎందుకు కాలేజీకి పంపరు? అని అడగడం నాదే తప్పని చెరగిపోయిన క్రాపును జాడించుకొని వెనక నంటినపిలకను జాడించి బిగించి బయలుదేరాను.

చెరువుగట్టున చలమయ్య బావిదగ్గరంతా గుంపుగా గూడి ఆడంగుల్ని నెట్టేస్తున్నారు పురుషపుంగవులు. కాలక్షేపంకోసం అదేదో చూద్దామనిపోయి తొంగి చూశాను నలుగుర్నీ త్రోసి. నాకండ్లు రెప్ప వేయకుండా ఎంత కాలం నిల్చిపోయాయో ... "నీళ్ళుతోడుతూన్న అమ్మాయి త్రాడు వదలిపెట్టి పడిపోయింది!" ఆ అమ్మాయిని లేపడానికందరూ సందేహిస్తున్నారు. 'చక్కగా మడి గట్టుకొంది లేతపిల్ల — ఎవరుచెప్మా!' అనినాలో నేనే వితర్కించుకున్నా ... పెడవేసుకునే ముసలమ్మ గుండె బాదుకుంటూ — "నామ్మే! ...నా తల్లే! కరణంగారి చిన్న బంగారం ... నీ కెంత అవస్థవచ్చిపడింది తల్లీ!" లేపండి, నీళ్ళల్లోపడి వుంటే ... అట్టా చూస్తారేమర్రా" అని గగ్గోలు ప్రారంభించిందా ముసలమ్మ. అట్టే చూస్తూ నిల్చిపోయాను. క్రొత్తగా కావ్యరసమాస్వాదిస్తోన్న నాకు ఆమె కావ్యకన్యకలా గోచరించింది. తడిబట్టతో వుండబట్టి యామె సౌందర్యాన్ని అమాయకంగావున్న నన్నే రెచ్చగొట్టింది. విడిబడిపోయిన శిరోజాలు, కందిపోయిన కపోలద్వయం — నా చేతితో నిమరాలనిపించింది, జివ్వున నరాలన్నీ లాగివేశాయి. నలుగురు ఆమెను సత్రం ముందు భాగంలో పడుకోబెట్టారు. పనీపాటా మర్చిపోయి సత్రం ముందున్న సాయిబు షాప్ నాముందు తిష్టవేశాను, ఆమె లేచాక ప్రశ్నల వర్షం కురిపించవచ్చని. వొంటరిగా ప్రశ్నించడానికి నాకు దమ్ములేవు. ఆ సంగతి నాకే

తెలుసు! నునుమీసముల వయసునున్న నన్ను ఆమెతో మాట్లాడ్డంజూస్తే లోకమేమంటుంది?

అరగంటసేపయ్యాక వయ్యారంగా లేచి జుట్టు సవరించుకుంది. నేనూ సాయిబు ఖార్ఖానా వదలి నలుగురిలో జొరబడ్డాను సత్రంముందు. నా చూపును నా వైఖరిని కనిపెట్టడానికామె కాస్తసేపుపట్టలేదు.

'నిపుణతలో ఆడవారిదే అందెవేసినచేయి!' అందులో ప్రౌఢనాయికలనుగూర్చి చేవకూరి వారి శారంగధర విజయవిలాసాలలో రుచిచూచాను. గనుక ఆమె సిగ్గుదొంతరలు, చీర సర్దింపులు నన్ను మరీ చకితుణ్ణిచేశాయి. ఆ నిమిషంలో నేనస్వతంత్రుణ్ణని మర్చిపోయా. నీళ్ళ తూగుతో కరణంగారమ్మాయి ఖార్ఖానుమీదుగా కాసేపటిలో మాయమయింది. నా ఆశ నిరాశయింది. మాట్లాడే అవకాశంగాని, ధైర్యసాహసాలుగాని లేకపోయాయి.

అరగంటసేపు ఖార్ఖానా సాయిబు నాతో మాట్లాడుతూనేవున్నాడు. నలుగురైదుగురు రైతు కుఱ్ఱాళ్లతో మా సంభాషణ కట్టింపయింది. "ఆ అమ్మాయి ఎందుకుపడిపోయింది" అని నేనంటే ఒకడు 'హిస్టీరియా' అన్నాడు, మరొకడు 'మూర్ఛలు' అన్నాడు. వేరొకడు "పెళ్ళీడురా నాయనా! పెళ్ళీడు!" అన్నాడు. నలుగురిలో తిరిగిఎరుగని నేను విస్తుపోయాను. చదువు సంధ్యలుమాని నలుగురిలో తిరిగితేఎన్నో విషయాలు తెలియగలవనుకున్నా. సాయిబు వీళ్ళ ధోరణిని విని పకపకా నవ్వాడు. 'ఏంటి సాయిబూ' ... అని అమాయకంగా దగ్గరకు జరిగాను.

"ఆ ... వుండండోయ్ పిల్లకారూ ..." అంటూ సాయిబు పట్టకారుతో కాలిన ఇనపముక్కను బాదడానికి లేచాడు. నా మాట, నా కుతూహలం సాయిబుకు పట్టినట్టులేదు. అసలక్కడివాళ్ళు నా మాట పాటించేట్టులేరు. సాయిబు సుత్తిదెబ్బలకు మైమరచిన నా మనస్సు మేల్కొంది. మామయ్య ఆజ్ఞలు, కంపటి విసరడం - మొదలగు నా దినచర్యలు జ్ఞప్తికొచ్చాయి. గబగబా కొండంగల్లో వినాయకుని వీధికి ఉడాయించాను.

ఆ రోజు రాత్రి కంటిమీద కునుకులేదు. శాకుంతలం వర్ణించే తొలిదినాలవి. కనుక దుష్యంతుడు "స్రస్తం స్రస్తం ... కనకవలయం హస్తం ప్రతిసార్యతే" అని విచారించడం స్ఫురించింది. ఆదినుండి నాయకుడప్రయత్నంగా నాయికను జూచి ముగ్ధుడవడం - నాయిక వయ్యారంగా తిరస్కరించడం, మదనజ్వరపీడితుడై నాయకుడు దుఃఖితుడవడం - వుండనేవుంది కావ్యప్రపంచంలో - నాయిక తప్పుల్ని మట్టుపెట్టి నాయకుడు ఇతరులపైన విరుచుకుపడ్డం కావ్యజగత్తులో ఊర్వశీ పురూరవులు! ఊర్వశిని కన్గొనలేక పురూరవచక్రవర్తి మేఘునిపై యాగ్రహించడం జరుగుతుంది. ఇది లోకంలో పరిపాటి! యౌవనాంకుర మావహించిన నాలో ప్రఖ్యాత ఫిలింస్టారులు జొరబడి మనసు కలవరపెట్టకపోయినప్పటికీని ... ఆదికవుల కావ్యకన్యకలు నన్ను పరిహాస మాడుతూన్నట్టు ద్యోతకమయ్యారా రాత్రి.

ప్రక్కనున్న వెలగచెట్టు ఒక రాజాల కోటపట్టు, ఖో...ఖ్ ... ల రొదతో కలతనిద్రతో మేల్కొన్నాను. నిద్రలేని నా కండ్లు ... మందంగా రెప్పలాడ్డం కనిపిస్తోన్నాయి. పదిసంవత్సరాల క్రింద జూచిన పాతాళభైరవి అందులోని తోటరాముని సాహసం! మర్చిపోలేదు.

ఆ రోజు ధైర్యంతో అలమారులో నాల్గుకాగితాలు పట్టుకొని పాడుబడ్డ దేవళానికి దారితీశాను. త్రోవలో నా మిత్రుడు అడ్డతెరలా నిలచేశాడు. 'ఏంటిరా ... కాగితాలు కలాయుధంతో బయలుదేరావు ఏమైనా ప్రణయలేఖలా ... కావ్యప్రపంచంలో కాలెట్టావుగా...' అన్నాడు నవ్వుతూ, ఆ దేధ్యాసలోవున్న నాకు వుక్కబోసినట్లయింది. 'ఆ, లేదురా బాబూ! చిన్న గేయరచనకు పూనుకుందామని' అన్నాను తొట్రుపాటుతో. 'అవున్లేరా! ఆధునిక కవులు గేయరచనలు - భావకవితలు బ్రద్దలయ్యేలా పత్రికలు చాటుతున్నాయి. ఇప్పుడు

మీ రోజుల్లేరా ... 'అన్నాడు మూర్తి. చొక్కా పట్టుకు మాట్లాడుతున్న మూర్తిని పల్టీకొట్టించి పాడుపడ్డ దేవళంకు చేరాను. ప్రణయవాహినిలో నేను ఎన్నడూ పయనించలేదూ - తరించనూలేదు. కనుక తొలిలేఖతో నన్ను సిగ్గు నూత్నవధువు నావరించిన విధంగా ముసురుకొంది. ప్రయత్నించి తెచ్చిన నాల్గింటిలో రెండు కాగితాలు చెడిపోయాయి. 'ఈ నా ప్రణయలేఖ నా ప్రణయమూర్తిని స్వీకరిస్తుందో లేక తృణీకరిస్తే తరించినట్లే!' మొన్న నాయుడుగారమ్మాయి చేయించిన విధంగా రాదు గదా కథ అనుకొన్నప్పుడు నా వళ్లు ఝల్లుమంది. తోటరాముడు - సాహసకార్యాలు ద్యోతకమయ్యాయి.

“నిన్ను నేను ప్రేమిస్తున్నా ... ఏమంటావ్? నన్ను తృణీకరింపవుగదా! ... నీకిదివరలో పెళ్ళయిందని విన్నాను. గత జీవితాన్ని గురించి కుమిలిపోవడం శ్రేయంగాదు, కోమలీ! నీ మాయని కపోల ద్వయం! - వినీలకుంతల సోయగం! లోకమునకు వెలువబనిలేదు. వయోవిచక్షణ పాటింపరాదు. నేను నీకంటె చిన్నగావచ్చు. ప్రేమపాశమునకు పురియున్న త్రాటిని దేనితో పురిబెట్టిరనుట యవివేకము. నియోగి ధర్మమును పాటింపక నా యీ ప్రేమ మాంద్యమునకు చికిత్స నొనర్ప సంసిద్ధురాల వగుము. ఎట్టి చర్యలకైన స్త్రీయే బాధ్యురాలు. దేవుని వైచిత్ర స్త్రీ మూర్తిలో మేళవించినాడు. నా యీ ప్రేమలేఖ నిన్ను సంతోషాబ్ధిలోముంచి తేల్చునో ... నన్ను కర్కశ శృంఖలా బంధంబుతో బంధింప నుంకించునో? ... చెలీ! ... ఇవే నా ప్రణయ మధుర స్మృతులు.”

ఇట్లు

నీ ప్రణయమూర్తి

“శాస్త్రి”

ఒకసారిగాదు - అనేకసార్లు చదివాను. మసక చీకటిలో దేవళం మరుగైపోతోందికూడా గ్రహించ లేకపోయాను. మా అమ్మకోరకు రెండు వేడికన్నీటి బొట్లు రాల్చాను. “ఈ ఉత్తరంసంగతి ఎలా?” అని విచారిస్తూ పరాకుగా అడుగువేస్తూ వస్తున్నా వెదుకబోయిన తీగ కాలికి దొరికినట్టు కరణంగారి రంగడు గోలీలాడుతున్నాడు. రంగడు నా మాట వింటాడని నాకు నమ్మకం కుదిరిపోయింది నిమిషంలోనే - రంగణ్ణి ఆవేశంతో పిల్చాను. ఒక్క కేకతో లేతహృదయం ద్రవించింది గాబోలు! రివ్వున నా చేతి నందుకున్నాడు రంగడు, “ఎందుకు శాస్త్రి పిల్చావ్” అన్నాడు కొంటెగా. అమాయకపు చూపులు - పళ్ళూడిబోయిన బోసినోరూ - పాపటిలేనిజుట్టూ, 'వెర్రి వెధవ' అన్నాను. రంగడేదో తప్పచేశాడన్నట్లు 'పో శాస్త్రీ' అని నా చేతిని వెనక్కు నెట్టాడు. 'రంగా మంచిపనిచెప్తా! చేస్తావా?' అన్నాను. ఏమీ ఆశ బెట్టకుండానే. రంగడు పోకిరివెధవ - మహా గడుగ్గాయి అంటారు. 'కాని రంగడు గొప్పవాడవుతాడు ముస్ముందు' అనిపించింది. నా జేబులోని కాగితాన్ని రంగడికిస్తూ - 'ఈ చీకట్లోమీ అక్కకిస్తావా?'... అన్నాను భయపడ్తూ, 'ఒస్! ఇంతేనా ఆట చెడగొట్టావే, అడుకోని ఇస్తాలే' అన్నాడు రంగడు. 'కాదు గూడదు. అది పోలం విషయం' అని ఆ పసిహృదయానికి మరుగు కల్పించి తొందరజేశాను. రంగడొక్కంగలో కరణంగారింటిముందు వాలాడు.

ఇక నేనింటికి వెళ్ళక తప్పిందిగాదు. 'వెలగచెట్టు మీది ఒక రాజుల యుద్ధం! మా రణహోమం' అని అరుస్తున్నట్టు నాలో భీతి ప్రబలమైంది. ప్రణయలేఖతో నా పెళ్ళి విషయంగాని - పరిహాసాలుగాని బయల్దేరతాయనుకుంటూనే ఇంట్లో అడుగెట్టాను. మామయ్యగారి ఆరవసంతానం హాహాకారాలు దీస్తోంది. ఎత్తుకొని మోయడానికేమీ లేదుగా శక్తి- నన్ను జూచి ఎగబడుతోంది క్షామపీడితలా - లేని సత్తువను దెచ్చుకొని దాన్నటూ యిటూ వూపుతున్నాను.

ఆ రోజు అమావాస్య. అమావాస్య రోజే నా ప్రణయలేఖారచనలు! అవ్వ! ఎంత పొరపాటు!

దొడ్డిలో అమ్మలక్కలు అమావాశ్యననుకోడం - నాకు తల దిమ్మయిపోయింది, విసుగ్గావుండి పిల్లను దింపి వేశాను, ఇక శోకాలాపన మొదలెట్టింది. పెంకిఘటం అబ్బ ఈ పిల్లల్ని కనేకన్నా ఆ జన్మాంతరం బ్రహ్మచారిగావుండి గడ్డాలు మీసాలు పెంచుకోడం నయమనిపించింది, ఈ బ్రహ్మరాక్షసులు పిల్లల్ని ... పెంచడానికా మహాతల్లులిలా అలవాటుపడి పోతారో ? విసుక్కుంటూ వాకిటి మెట్లెక్కుతూల బడ్డా - రంగని అరుపులావుంది - కేకలు పెడ్తూ ఏడుస్తున్నట్లున్నాడు. అలా తొంగిచూశాను. రక్తనాడులన్నీ వొక్కసారి బిగుసుకుపోయినట్లయ్యాయి. ఇంకేముంది కరణంగారు గంగణ్ణి బాదుకుంటూ మా గుమ్మంలో అడుగెట్టారు. ఎదురుగానున్న నన్ను చురచురా జూచారు కరణంగారు. "ఏమోయ్ ! ఏంజేస్తున్నావు యింట్లో, మా మామకోసం యిల్లంతా గాలించాడు. యమకింకరునిలా మామయ్య రానే వచ్చాడు. ఇక ఇల్లంతా విమర్శలు - ఆందోళనలు - యుద్ధసన్నాహమూ, ఈ సమావేశం, పన్నాగం, నన్ను హాగ్రణ్ణిచేశాయి. చిన్ననాటనుండి పెంచిన మామకు నాకు పెళ్ళీడొచ్చిందని తెలియదూ ? కనీ పెంచిన తల్లిదండ్రులకు నీతినియమాలు నూరిపోయనక్కర్లేదు. అంతా విన్న మా మామ రైటింగ్ ప్లేడ్ ని నా మీదకు విసరాడు. కరణంగారి క్రోధము ణగారినట్లయింది. విజయకేతనాన్ని స్థాపించిన వానిలా కోరచూపు నావైపుచూపి చేత్తో రంగణ్ణి లాక్కుపోయారు కరణంగారు. అప్పుడే మామగారి పిల్లలు నా చుట్టూచేరి భజనచేయడం మొదలెట్టారు. 'శాస్త్రిగాడికి పెళ్ళంట' అని వొకటే గోల. మా మామ ఉత్తరాన్ని చదువుతూ మంటకు పెయ్యితిట్లు పలిస్తూ, మా నాన్నగారి వంశాన్ని లెక్కిస్తూ తిట్టాడు. ఆ రాత్రి యీ ప్రణయమూర్తిని ప్రేమపాశం కాలపాశమయింది. కన్నీరు వెల్లువలై ప్రవహించిందనడానికి తార్కాణమేముంది నిరాశాజీవికి. ఏకాంతమే నా కానందమనుకున్నా - బానిస బ్రతుకు జీవితంలో రోతనిపించింది. మామ దెబ్బతో అణగారిన ఆవేశం మెరుసులెత్తింది. మామగారి కొలువుకు రాజీనామా యిస్తేగాని మంచిదిగాదనుకున్నా.

ఉదయాన్నే ఉప్పులూరివారి చెరువుగట్టున పల్లుతోముకుంటూన్న వామనరావు పేరెట్టి పిల్చాడు. వాడు మాతుంటరి - నా ప్రణయగాధ వాడికీ వివరంగా తెలిసేవుంటుందనుకున్నా - గుండె నిబ్బరంతో వామనరావు కాళ్ళదగ్గిర వాలిపోయాను. 'శాస్త్రీ ఎంతపనిచేశావ్ నీలోగూడా ప్రవేశించిందా ప్రేమపిశాచం ! పాపం - శాస్త్రీ మీ మామ కొట్టాడటగా - కరణం బాబాయి కొట్లో మా దంచి కొడ్తున్నాడులే నీ సంగతి' - అని వంచుకున్న నా తలను ఎత్తాడు వామనరావు, కొంచెం ఔదార్యం గల్గిందా సమయములో - వేడి కన్నీటి ధారలు ప్రవించాయి, ఎర్రటి నా చెంపలు కందగడ్డలయ్యాయి. 'శాస్త్రీ ! ఏడవకోయ్, ఏంటీ ఆడపిల్లమల్లే' అన్నాడు గేలి చేస్తూ.

'శాస్త్రీ ! నేను మిలటరీ కెళ్తున్నారా ?' అన్నాడు దర్జాగా ప్లేటుమార్చి. ఈ పరాభవంలో నాకదే శరణ్యమని తోచింది. గుండె గతుక్కుమంది. ఆ పని నాకసాధ్యమనిపించింది. తెలియని రీతిగా 'వామనరావ్ ! నేను కూ ... డా ...' అని ప్రాధేయ పూర్వకంగా వేడుకున్నాను, వామనరావు నా కష్టాన్ని గుర్తించే వ్యక్తని నాకు బాగా తెలుసు.

ఉదయాన్నే మేమిద్దరం విజయవాడ చేరుకున్నాము, వెంట వెంటనే నన్నరడజను ఫోటోలు తీసుకున్నారు, పిలకా, నొసటకుంకుమనిచూచి విక్రుతంగా నవ్వారు అవి వొదలించడానికి వారికట్టే కాలం పట్టలేదు. ఎర్రసిరా సంతకంతో మిలిటరీ యూనిఫారం ధరించాను. పాపం వామనరావుకు మాత్రం అదృష్టం దూరమయింది. పదహారు పౌనులు తగ్గిన వామనరావు నిరాశతో యింటికి చేరాడు. నేనప్పటికి నరకలోకం దాటిపోయాననుకున్నా.

వామనరావును మా మామ నిలవదీసి అడిగితే నాకు తెలియదని చెప్పమని చేతులు పట్టుకున్నా -

నా విషయం పట్టీపట్టని మా మామ నాల్గు రోజుల్లోనే నన్ను మర్చిపుంటాడు. ఆ కుటుంబంలో నన్ను గురించి జాలిపడే వాళ్ళెవరున్నారు? నన్ను గురించి పలవరించడానికి.

రెండేళ్ళకే మైన్స్ నడపడంలో నేర్పరి నయ్యాను. మామగారింటికిపోయి దర్శిద్దామను కున్నాను. డిస్‌ఛార్జితో మా మామగారింటిలో అడుగెట్టాను. కళ్ళద్దాలు సరిచేసుకుంటూ 'ఎవ రయ్యా' అంటూ బక్క చిక్కిన డొక్కతో పలకరించాడు మామయ్య. 'నేనే మామయ్యా!' పిల్ల లేరీ అంటూ పక్కమంచంలో కూలబడ్డా. 'ఎంత సంపాదించావోయ్? శాస్త్రీ మిలటరీలో' అంటూ- మా అక్క వంటింట్లోనుండి వచ్చింది.

సూటు బూటూ - నల్లని కండ్లద్దాలు - రిష్టువాచీ చూచి మామయ్య నీళ్ళు నముల్తున్నాడు. 'మరెక్కడ నివాసం?' అన్నాడు మామయ్య. 'మా వూళ్ళోనే పూరిల్లు బాగుచేయించుకున్నా' అన్నాను తమాయించుకొని, 'ఎంతపని చేశావురా శాస్త్రీ' అన్నాడు మా మామ కొడుకు మూడోవాడు. 'వుండండోయ్, తొందరపడకు, నీవు మాత్రం' అని మాత్రం అనగల్గాను. ఇంటి ప్రక్క ఇడ్లీ అమ్మే ముసలమ్మ నా మాట వినగానే నన్ను చూడ్డానికన్నట్లు విచ్చేసింది.

'శాస్త్రీ! ఎప్పుడూ రావడం? బాగున్నావా? నాయనా!' అంది వణకిపోతూ, 'బాగానే వున్నావా?' అన్నాను. 'అక్కడెలావుంది బాబూ!' అని ముసలమ్మ నోరు చప్పరించింది. 'చప్పరించినట్టే వుంటుందవ్వా' అన్నాను ఛలోక్తిగా - పకపకా నవ్వింది ముసలమ్మ.

నా వైపుజూస్తూ 'శాస్త్రీ! నీ పెళ్లాక ఏంజరిగిందో తెలుసా? ... నాయనా! కరణంగారమ్మాయి లేదూ ... 'అబెడేగా నిన్నింత అన్యాయం చేసింది మేనమామతో మాయమయింది.' అని నా చెవిలో రహస్యంగా వూదింది. 'ఇక్కడ లేదా?' అన్నాను. మా మామ పకపకా నవ్వాడు, 'లేదు బాబూ! ... చాలాలయిందిగా పోయి. కరణం గారేమన్నారు' అన్నాను. 'ఏమనేదేముంది? మంచమెక్కాడు' అంది. అప్రయత్నంగా 'రంగడో' అని అన్నాను. 'బొమ్మ పెంపకంలోవున్నాడు' అని ముసలమ్మ లేవబోయింది. 'ఆమె మామకు పెళ్ళి పెటాకులయ్యాయిగా. గుమాస్తాలోవున్నాడు. వాడి పెళ్ళికిముందు పిల్లను, అడిగితే 'ససేమిరా!' అని భీష్మించింది. భగవద్గీతలో మునిగి తేలతానందిగా' 'నిన్నింతరచ్చపాలు జేసింది శాస్త్రీ!' అంది ఆమె మమకారాన్నంతా నామీద వొలకరిస్తున్నట్లు, మామామకు మా సంభాషణ వెగటుగా తోచింది గాబోలు; 'శాస్త్రీ! స్నానానికి రావూ ...' అన్నాడు. వద్దు మామయ్యా నేనీ బండికేపోతున్నా నన్నాను. ముసలమ్మ కాస్తా సర్దుకుంది.

స్నానం తప్పకుండా చేయవలసివచ్చింది. మా మామ పెద్దకూతురు రాధను నాకిద్దామని అనుకోనే లేదు. ఇప్పుడు మామకు నేనే పెద్దల్లుణ్ణి కావలసి వచ్చింది. ఈ రోజు పెండ్లికూతురులా తయారయింది. 'రాధ పెద్దదయిందే' అన్నాను అక్కయ్యతో; 'శాస్త్రీ' అని కేక వేశారెవరో 'ఎవరూ' అంటూ మా కిట్టు తడికతోశాడు. ఏడీ 'శాస్త్రి' అంటూ వామనరావు ప్రత్యక్షమయ్యాడు. వామనరావుకు కను సైగజేశాను రాధను జూడమని, ఒక్కనవ్వునవ్వి 'శాస్త్రీ మర్చిపోయావా? రైటింగ్ పేడ్ డబ్బ!' అన్నాడు. 'ఏమోలే వామనరావు! ఎంతయినా తల్లి దండ్రీలేనివాణ్ణి, పెంచి పెద్దజేశాడు మామయ్య. రాధను చేసుకుంటే నా వంశాన్ని నిలబెట్టుకున్న వాణ్ణవుతాను.' అన్నాను తాపీగా. 'అంతేలే శాస్త్రీ మాటల్తో, కత్తులు కలకాలం పెంచుకుంటే ఎలాగా?' అన్నాడు వామనరావు. కాఫీతో వామనరావును సాగనంపాను.

మామామగారింట్లో యిలాంటి వలపుల భరిణ రాధ తయారవుతుందని, రాధను నాచేత పెడ్తారనీ కలలోకూడ కననులేదు. 'నా రాధ నా బృందా

వసానికి ప్రపాపాలిక! ఆలావణ్యమయి నా ఆశాజ్యోతికి హిరణ్మయి! రాధ ఈపిపాసార్తునికి ప్రపాపాలికనుటలో పొరపాటులేదుగదా!' రైల్వే ఉద్యోగినై మూడువందలు సంపాదించే నేను మామాగారింట అధ్యక్షుణ్ణయ్యాను. నేనీనాటికి సంఘంలో ఉత్తమవ్యక్తినయ్యాననుకున్నాను. రాధ కోరికమీద మామగారింటికి తిరిగి రాకుండావుండలేక పోయాను.

పష్ట్ క్లాసులో రాధనెక్కించి బుక్ స్టాల్‌కి దారితీశా - 'మోసంచేసిన మాయలాడి' డిటెక్టివ్ కొన్నా. రివ్వున కంపార్ట్‌మెంటులో వాలిపోయాను. బండికదిలించి వెనక్కూ ముందుకూ జరిగింది. పెండ్లినాటి నాట్వీడ్ సూటు - తెల్లనిషర్టూ - గళ్ళనెక్‌టై. కళ్ళకునల్లద్దాలు - రాధ ముసి ముసినవ్వుల్ని ప్రసరించింది. షిఫాన్ చీర చిందరవందరలో రాధవొడిలో వాలిపోయాను. 2, 3, గుజరాతీ స్త్రీలతోను ఒక్క హిందూయువతి వున్నట్లున్నారు. నూత్నదాంపత్యమని మమ్మల్ని గురించి గుజరాతీ స్త్రీలు గుసగుసలాడ్డారు. రైలు కిటికీల గుండా చల్లని శీతకిరణాల్ని ప్రసాదిస్తున్నాడు. మలయమారుతంలా తెమ్మెరలు పయనిస్తున్నాయ్! నా ఎదుటి మనిషిని గుర్తించగల్గాను. ఆమె ఎవరోగాదు, కరణంగారమ్మాయని గుర్తించలేకపోయినందుకు నేనేచకితుణ్ణయ్యాను.

'ఏం ... రాధా!' అని మాటగలిపింది మా ఆవిడతో. 'నేను మెల్లగా తలుపునానుకున్నా లేచి. 'అంతా మారిపోయారే!' అంది అదోలా - 'అవును చాల కాలమయిందిగా' అందిరాధ. "ఎక్కడనుండేం రావడం? పెళ్ళయిందే!" అన్నది కరణంగారి లక్ష్మి. మామామయ్యకిచ్చారు. అయిగో అంటూనన్ను జూపింది. ఈ సంభాషణవింటోన్న నేను ముసిముసి నవ్వులు నవ్వా బయటి ప్రకృతిని విలకిస్తున్నా "కరణం గారమ్మాయి" నా వైపు చిత్తుపోయి చూచిందంతే!.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౼ ౨

శ్రీ బలాంతాక్షర - చెలువంబుఁగల్గిన
యారురేకుల పద్మమందు రామ!
యుదక తత్త్వమునొంది - యొప్పారి
యున్నావు
అభయ హస్తముగల్గి యమలచరిత!
జపమాలికనుగల్గి, సచ్చిదానంద! క
మండలువునుదాల్చి - మహిమతోడ
నాల్గుమోములఁబూని - నటనా విశారద!
విశ్వరూపకుసూపు వేదవేద్య!

రామచంద్ర! నిన్ను రక్తితో భజియింతు
నన్నుఁగావుమయ్య! సన్నుతాంగ!
సతము నీదు చింత సల్పుచుందును రామ!
భద్రగుణ సముద్ర! పంకజాక్ష!

౼ 3

శ్రీ డఫాంతాక్షర - చెలువంబుతోనొప్పి
యగ్నితత్త్వము తోడ నలరునట్టి
మణిపూరకంబను - మహిత చక్రమునందు
శంఖ చక్రముల, హస్తమునఁదాల్చి
ఇంద్రనీలశ్యామ! ఇనకులాభరణ! సీ
తామనోహరుఁడ! శ్రీరామ చంద్ర!
గద, చేధరించిన - కౌస్తుభాలంకార!
విష్ణురూపుండగు వేదవేద్య

యంధకార మనెడి యజ్ఞానమును బాపి
వెలుఁగుఁ జూపుమయ్య! వినుత చరిత!
నిన్ను నుతులొనర్తు - నిత్యంబు సత్యంబు
రామచంద్ర! వరద! రాజవదన!

౼ ౪

శ్రీ కఠాంతాక్షర - చెలువంబుతోనొప్పి
వాయుతత్త్వంబునఁ బరిఢవిల్లి
అబ్జారి ఖండంబు, నొసలఁదాల్చి, య
నాహత చక్రంబు నందు, వాస
మొనరించియుఁ ద్రిశూలమును, ధరించి,
యభయ
హస్తుఁడై, శివరూపుఁడైన రామ!
దర్పరూపముతోడఁ దాండవ కేళీ, వి
నోద నృత్యముల, సమ్మోదముగను

సల్పుచున్నావు భక్తులు సంతసింప,
రిపులు భయమొందఁ, బార్వతి ప్రీతిఁజెంద
జనకజ, ముదంబు పొందంగ సాంత్వమందు;
వరద! శ్రీరామ! శివరూప! వందనములు

౮౫

శ్రీ సురూపుండవు! చింతింప, రూప వ
    ర్జితుఁడవు! సకలాత్మ గతుఁడవీవు!
అద్వితీయుఁడవీవు! యఖిలవస్తువులందుఁ
    దాండవమాడెడు తజ్ఞుఁడీవు!
జీవ జీవాత్ముఁడై - చేతనాధీనుఁడై
    యాకాశ తత్త్వంబు నందు దీవు!
శుభగుణరామ! విశుద్ధాభ్య పద్మంబు
    స్థానంబుగాఁగొన్న చతురుఁడీవు!

కారణములేని, జీవావతారుఁడగుచు
నధికుఁడై, సీతతోఁగూడి యలరుచుండు
రఘుపతీ! చిన్మయానంద! ప్రార్థనంబు
సలిపి, భజియించి సేవింతు జలజనయన!

౮౬

సీతామనోహరా! జ్యోతిస్వరూపుఁడై
    యానంద రూపుఁడై యలరినావు;
శ్రీ ద్విపత్రాబ్జంబుఁ జేరి, మధ్యమునందు
    వసియించి యున్నావు పంకజాక్ష!
పరమాత్మరూపుఁడై - భావంబులందు, దీ
    పము వలె నున్నట్టి - పరమపురుష!
జగములఁ బుట్టించి - సంరక్షణ మొనర్చి
    లయమొనర్చెడి, త్రిమూర్త్యావతార!

భావ విష్ణువగుచు, భావంబు తెలిఁగెడి
తత్త్వశాలివీవు! తజ్ఞుఁడీవు!
రామచంద్ర! సతము రక్తిని భజియింతు
నన్నుఁగావుమయ్య! సన్నుతాంగ!

౮౭

శశి, యమృతధారలవి, సహస్రారపద్మ
మందుఁబడు చుండఁడడిసి,యానందమూర్తి
వగుచునున్నావు శ్రీ రామ! అఘవినాశ!
తలఁపఁబరదైవముల, నిన్నెకొలుతుసతము.

౮౮

క్షీరసాగర ద్వీపంబులో - రమేశ!
లక్ష్మితోడమీద వసియింప, రాజితముగఁ
గల్పకంబుల క్రింద, బంగారు మంట
పమున, శేషశయ్యఁ బరున్నవాఁడవీవు!
రామ! వేఱుదైవముల, మఱచినవాఁడ
సతము, నిన్నె సేవింతును, సంస్మరింతు.

౮౯

జ్ఞానరూపుండవు; సుషుమ్నానాడియొక్క-
మధ్యమున, హంసరూపుఁడై -మాధవుండ!
వెలుఁగుచున్నావు; చక్రంబుఁ జేతఁబట్టి
శంఖము ధరించియున్నావు; సారసాక్ష!

రామ! పీతాంబరముగట్టి - రమణిసీత
సేవ సలుపఁగఁ జెలువారు శ్రీ శుభాంగ
ఇతర దైవంబునెఱుఁగ, నేనెఱుఁగ నెఱుఁగ
నిన్ను సతతంబు సేవింతు నిశ్చయముగ

౫౦

కల్పతరువుల క్రిందఁ బ్రకాశమైన
స్వర్ణపీఠంబునందు, భూజాతయుక్త
వై, యధివసించి, పూవులవానఁదడిసి
మునులు, వానరుల్ నీ సేవ లొనరసలుప
సంతసంబున నున్నావు సారసాక్ష!
ముదమలర, నిన్ను ధ్యానింతు హృదయ
మందు.

(సశేషము)

---

(238 వ- పేజి తరువాయి)

డం అంటే ఎంత ప్రమాదావస్థో చెప్పటం అనవసరం......

ఈ పిల్లవాడు అంత ప్రొద్దున్నే రావటం, నన్ను నిద్రావస్థలోనుంచి బయటికి చేరదీయటం, అంత అప్యాయంగా, పరాయి మనిషినన్న మాటనే మరచిపోయి, ఏ మాత్రం మొహమాటం లేకుండా ఆ బొమ్మని గీయమని అడగటం ... ఇదంతా చూస్తే వాడిపట్ల ప్రేమ మధురానుభూతులు నాలో అంతు చిక్కకుండా ప్రవహిస్తూవున్నాయి. దాంతో నా దుర్భరావస్థనే పూర్తిగా మరచిపోయాననీ చెప్పవచ్చు ...

నా చొక్కా జేబులను తడిమాను. ఫౌంటన్ పెన్ వుంది. తెల్లకాగితం వుంది. వాటిని చప్పున బయటికి తీశాను. కాని నేను గీయాలసింది ఏమిటి? ఒక మేకనా? ఎంతో చదివినవాణ్ణి. ప్రపంచాన్నే ఎన్నోసార్లు చుట్టి వచ్చినవాణ్ణి. ఒక ప్రకృతి ప్రపంచం ఒక్క సౌందర్యాన్ని ఆస్వాదించినవాణ్ణి కాదు. లోకుల వివిధ రుచులను క్షుణ్ణంగా అవగాహనం చేసుకొన్నవాణ్ణి చిత్రకారుడని కూడా నాకు పేరు ప్రతిష్టలు వున్నాయికూడా! అటువంటి నేను ఒక మేక బొమ్మని గీసి ఇయ్యటమా? కుర్రతనంలో అలా గుర్రాలని ఆవుల్ని, మా ఇంటి ఆవరణంలో తచ్చాడుతూ వుండే ఇతర జంతు జాలాని, పక్షి జాలాన్ని గీయటం ఒక యెత్తు. ఆ రోజులకి అవి మామూ, తప్పకుండా సరిపోతాయి. కాని ఇప్పుడు నా పరిస్థితులు ఒక ఎత్తు. ఇలాటి సమయంలో అలా చేస్తే ఎంత నామోషి. ఎంత నామోషి. అంతేనా దానిని చూసిన ఇతర్లు ఏమనుకుంటారు?

(సశేషము)

# "మాట్లాడే పుస్తకం"

—x—

రేడియోగ్రహణ, శబ్దవిద్యల లెనిన్ గ్రాడ్ పరిశోధనా సంస్థ ఒక చిట్టిరేడియోను డిజైను చేసింది. మామూలు సైజుపుస్తకానికిమించి ఉండదది. "ఉత్సవం" అన్న దాని ట్రేడ్ మార్కు, ఉత్పత్తిచేయబడిన స్థలము, సంవత్సరం - "లెనిన్ గ్రాడ్, 1957" దానిపైన ఉండే తోలు బైండు పైన బంగారు రంగు అక్షరాలతో అచ్చు వేయబడి ఉంటాయి.

ఈ పుస్తకాన్ని తెరిచినప్పుడు, దానిని చదవడంగాక వినవలసి ఉంటుందని తెలుసుకొన్నప్పుడు చాలమందికి ఆశ్చర్యం కలుగుతుందన్నమాట నిజమే. పైన ఉండే తోలుబైండు ఆ రేడియో సెట్టుకు తొడుగుగా ఉపయోగపడుతుంది.

దీనిని ఉపయోగించడంచాలా సులభం. రెండు చిన్న ప్లాస్టిక్ మీటలు ఉంటాయి. ఒక మీట రేడియోను "స్విచ్" చేయడానికీ, ధ్వని హెచ్చు తగ్గులను అజమాయిషీ చేయడానికీ ఉపయోగపడుతుంది. రెండవ మీట యే కేంద్రం కార్యక్రమం కావాలంటే ఆ కేంద్రానికి తిప్పుకోడానికి ఉపయోగపడుతుంది.

దీనికి ఏరియల్ గాని, ప్లగ్ గాని లేదని తెలిస్తే కొందరికి ఆశ్చర్యంకలుగుతుంది. కాని అలాంటివేమీ లేవు! ఫెర్రయిట్ అనే ఒక కొత్తవస్తువుతో దానిలోపలి భాగాలు తయారుచేయబడ్డాయి. ఆ "పుస్తకం" లోనే అమర్చబడిన ఒక మామూలు టార్చిలైటు బ్యాటరీతో ఇది పనిచేస్తుంది.

మామూలు వాల్వులకు బదులుగా ట్రాన్సిస్టర్లను ఉపయోగించుట ద్వారా అంత చిన్న రేడియో సెట్టు డిజైను చేయడం సాధ్యమయింది. ఈ సెట్టు నమ్మకంగా అనేక సంవత్సరాలపాటు పని చేస్తుంది. మీడియం ఫ్రీక్వెన్సీలోనడుస్తుంది.

ఈ మాట్లాడే పుస్తకాన్ని ఇంజనీర్లు, ఎ. మాక్సిమెంకో మొదలైన ఇంజనీర్లు డిజైను చేసారు. ఈ జట్టుకు డిజైనర్ ఏన్. కాలిఖమన్ నాయకుడు. ఈరకం రేడియో సెట్లు మాస్కోలోని సోవియట్ దేశపారిశ్రామిక ప్రదర్శనంలోను, లెనిన్ గ్రాడ్ లోని వైజ్ఞానిక, సాంకేతిక ప్రచారమందిరంలోను ప్రదర్శింపబడుతున్నాయి.

—(౦)—




**భాగ్యశాలి : శ్రీ బద్దెపూడి రాధాకృష్ణమూర్తి. ప్రకాశకులు : కల్చరల్ బుక్స్ (ప్రైవేట్) లిమిటెడ్, 31 మీరాసాహెబ్ వీధి, మద్రాసు-2. వెల 50 నయా పైసాలు.**

ఇది ఆస్కార్ వైల్డ్ 'ది హాపీప్రిన్స్' ననుసరించి వ్రాసిన పిల్లలపుస్తకము. చక్కగా నిందులో చిత్రాలతోటి, సులభమైన శైలిలో ఆకర్షణీయంగా నున్నది. కథ చదువుతున్నంతసేపు ఉత్సాహకరంగాను, ఆసక్తికలిగిస్తూ యున్నది. ఇది బాలబాలికలను ఆకర్షించగలదని ఆశిస్తున్నాము.

**'అవతార్ శివానంద' : స్వామి శ్రీనివాసానందజీ. ప్రచురణకర్త : స్వామి ఆత్మస్వరూపానందజీ, రాజమండ్రి. వెల రు. 1-00.**

గ్రంథకర్త స్వామి శివానంద సరస్వతి శిష్యులు. వారికి స్వామీజీతోనున్న సన్నిహిత సామీప్యమును వినియోగించి శ్రీ శివానంద సరస్వతిని గురించి రచించిన యీ చిన్న పుస్తకము అమూల్యమైనది. ఋషీకేశమునుండి ఆధ్యాత్మిక సందేశముతోబాటు ప్రజాకోటికి మానసిక శారీరక శాంతి స్వస్థతలను సమకూర్చుచున్న స్వామీజీచరిత్ర సంగ్రహముగా సామాన్య ప్రజల నుద్దేశించి వెలువడుట సంతోషింపతగిన విషయము.

**సర్వగీతార్థసారము : శ్రీ మహామండలేశ్వరస్వామి శివానంద సరస్వతీ మహరాజ్. అనువాదకులు : శ్రీ నండూరి వేంకట సుబ్బారావు. ఏలూరు, ప. గోదావరి జిల్లా. వెల రు. 2-00.**

శ్రీ భారత, రామాయణ, భాగవతాది గ్రంథములందలి అచ్చటచ్చటగల ఆధ్యాత్మిక సంబంధమైన గీతలను, వాని అర్థసారమును తెలిసికొనుటకు, మూలగ్రంథములను పఠించి అర్థము చేసికొనకలుగుట సుసాధ్యము కాదు. అందుకని ప్రతిగీతనుండి ముఖ్య శ్లోకములను స్వామి శివానంద మహరాజ్ ఆంగ్లమున తర్జుమాచేసి ఫారెస్టుయూనివర్సిటీ వారపత్రికలో ప్రచురణమైనవి. వానిని ఆంధ్ర ప్రజానీకపు ఉపయోగార్థమై ఆంధ్రీకరించి శ్రీ సుబ్బారావుగారు యీ పుస్తకమును వెలువడజేశారు. ఈ గీతార్థసారము అమూల్యమైనదగుటచే ఆధ్యాత్మిక చింతగల వారందరు దీనిని సద్వినియోగం చేసికోగలరని ఆశిస్తున్నాము.



# సంపాదకీయములు

## ఇండియా – పాకిస్తాన్‌లు

ఇండియా, పాకిస్తాన్‌లు యిరుగు పొరుగు రాజ్యాలయినా ఆదర్శ లక్ష్యాలలో ఉత్తర, దక్షిణ ధృవాలుగా నుండుట చాల విచారకరము.

పాకిస్తాన్‌లో హిందూ దేశంలోకంటె ఆర్థిక దుస్థితి దుర్భరము. ప్రజలకు శాంతి బద్రతలు బహు తక్కువ. ప్రభుత్వము నిలకడైన సమర్థమైన నాయకత్వము క్రింద యీనాటికి ఏర్పడలేదు. అభివృద్ధి అభ్యుదయాలంటూ యీ నాటికి దేనిని సాధించ గలుగని పాకిస్తాన్ కాశ్మీరు విషయంలో ఇండియాపైకి కాలుదువ్వడం న్యాయ విచక్షణ లేకపోగా రాజ్యకాంక్ష మాత్రము కనుపిస్తున్నది

భారత దేశానికి రాజ్య కాంక్ష కాని, అధికార ఆధిపత్యవాంఛ గాని కాశ్మీరు ఇండియాలో చేరుట యందున్నదని ఏమాత్రం రాజకీయ పరిజ్ఞానమున్నవారు అనలేరు. ఇండియా శాంతి భద్రతల రక్షణ దృష్ట్యా కాశ్మీరు కీలక స్థానం. అందుకని స్వయంగా ఇండియాలో విలీనమయిన కాశ్మీరుయొక్క అభివృద్ధి అభ్యుదయాలకు కోట్లకొలది రూపాయల పెట్టుబడి పెట్టి, దాని శాంతి భద్రతల రక్షణ భారము వహించవలసినట్లుగా ఏర్పడినది.

తను యీనాటి అనేక సమస్యలను పరిష్కరించుకోలేక దినగండం నూరేళ్ళాయుష్షుగా సాగిస్తున్న జీవితాన్ని పాకిస్తాన్ పారజూచుకోకుండా దైనిక ప్రజా సమస్యలను మసిపూసి మారేడుగాయ చేసి వారి దృష్టిని ఇండియాపై మరల్చి కయ్యానికి కాలుదువ్వ పూనుకోడం పాకిస్తాన్‌కు ఆత్మ విధ్వంసకమే కాగలదు.

ఇండియాలో సయితం జాతీయ నాయకత్వపు జిగి, బిగువులు తగ్గినవి. నాయకత్వము ప్రజల ఆదరాభిమానములకు దూరమగుతున్నదా యనిపించు చున్నది, నాయకత్వములో సయితము చిత్తశుద్ధి, వాస్తవిక పరిజ్ఞానము, త్యాగసేవాసక్తి నశించినవి. ప్రజలను సంఘటిత పరచి జాతీయ శ్రేయోభివృద్ధులను తీర్చి దిద్దుటకు బదులు ముఠా రాజకీయాలతో ఆధిపత్యం, అధికార వాంఛలకు బలియైనది. ఇక కాంగ్రెస్‌ను వదిలేసి, ఏ జాతీయ పార్టీని చూసినా ప్రజా శ్రేయస్సు నుద్దేశించి సమరస సమైక్యతలతో సమర్థమైన నాయకత్వము ఏర్పడు సూచనలు కనుపించవు. ఎక్కడ చూచినా బహు నాయకత్వము, అధికార ఆధిపత్యముల లాంటి స్వార్థ భరితమైన సమస్యలే కనుపిస్తున్నవి.

ఈ పరిస్థితులలో కాంగ్రెస్, తదితర జాతీయ పక్షములు యికనైనా జాగ్రతపడి ప్రజలకు సన్నిహితం కాకపోయినచో పాకిస్తాన్ నాయకత్వముకంటె మెరుగనిపించుకోదు.

## శోచనీయ పరిస్థితి

వైద్య సౌకర్యాలులేని ప్రదేశాలుండగా, ఉన్నచోట్ల నయినా 200 ఆసుపత్రులలో (ఆంధ్ర

ప్రదేశ్‌లో) డాక్టర్లు లేకపోవడం, మరికొన్నింటిలో తగిన సిబ్బందిలేకపోవడం ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి వెల్లడించినట్లు కడు శోచనీయము.

ఈలాటి పరిస్థితికి బాధ్యులు ఎవరు ! అనే ప్రశ్నకు బదులు చెప్పాలంటే ఆలోచించవలసినదేమి లేదు. ప్రజల ఆరోగ్య సౌభాగ్యములపట్ల శ్రద్ధ వహించవలసిన రాష్ట్ర ప్రభుత్వము అవసరమయితే ఆకర్షణీయమైన అవకాశములచూపి డాక్టర్లులేని ఆసుపత్రులకు డాక్టర్లను సేకరించ ప్రయత్నించినదా? ప్రయత్నించి సయితము డాక్టరు దొరకనిచో L. I. M. డాక్టర్లనో లేక అనుభవజ్ఞులైన దేశీయ వైద్యుల ద్వారా వైద్య సహాయమును, సౌకర్యాలకు ఏర్పాటు చేయ నెందుకు పూనుకొనలేదు ? తగిన సిబ్బంది, మందులు లేని ఆసుపత్రులకు వానిని ప్రభుత్వము సమకూర్చకుండుటకు కారణమేమి ? అనే ప్రశ్నలకు సమాధానము వైద్య సౌకర్యాలకని వెచ్చించే ధనం ప్రజావసరాలకు ఏ మాత్రం వినియోగపడుతున్నదో ప్రభుత్వము అశ్రద్ధతో పరిశీలించకుండుట ఒక కారణం. రెండవది ప్రభుత్వము ప్రజారోగ్యముపట్ల చూపుచున్న శ్రద్ధాసక్తుల లోపము కొంత.

ప్రజారోగ్యము జాతీయ శ్రేయస్సుకు ప్రధానమైనది. దాంతోబాటు విద్యావిజ్ఞానములు ప్రజల ప్రధానావసరములు. వానిని ప్రభుత్వము ఉపేక్ష చేయుడం అభ్యుదయ చిహ్నం కానేరదు.

వైద్య సౌకర్యాల సమర్పుటలో డాక్టర్ల, నర్సుల కొరతయున్నా, మందులు సిబ్బంది వసతులు లోటుపడినా, ప్రయత్నము చేసి కొరత తీరునట్లు లోటుపాట్లను సరిదిద్దవలసినది ప్రభుత్వము. ప్రజావసరాల గుర్తించి వారిఆరోగ్య సౌభాగ్యాలపట్ల ఆసక్తి చూపినచో యీ సందర్భమున ప్రజల సహాయ సహకారములు సయితము విరివిగా లభించగలవు.

—— (o) ——

అలీఘర్ విశ్వవిద్యాలయం ఇంగ్లీషు ఎం. ఏ పరీక్షకు కూర్చున్నవారిలో నలుగురు బిడ్డలతల్లి శ్రీమతి పుష్పాసింఘల్ అగ్రస్థానము నలంకరించినది. ఈ విశ్వ విద్యాలయము స్థాపించినది మొదలు ఇంగ్లీషులో ప్రథమ స్థానంలో ఉత్తీర్ణ అయినదికూడ నీమెయే నట.

♦ ♦ ♦ ♦

చేనేత పరిశ్రమ నుద్ధరించుటకు పవర్ మగ్గాలు తోడ్పడవనియు, చేనేత రంగమునుండి పవర్ మగ్గాలను తొలగించడం అత్యావసరమని ఆంధ్ర చేనేత మార్కెటింగ్ కోఆపరేటివ్ సొసైటీ అధ్యక్షుడు శ్రీ యం. సోమప్పగారు సూచించారు.

# శ్రీ విళంబినామ సం||ర జ్యేష్ఠ, ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | సో | చతు 16-27 రో 36.3 |
| | 17 | మం | ● అమా 17.42 మృ 38.42 త్యాజ్యాభావః |
| | | | ఆషాఢమాసము |
| జూన్ నెల | 18 | బు | శుపా 17.40 ఆర్ద్ర 40.6 |
| | 19 | గు | ది 16.24 పు 40.17 |
| | 20 | శు | త 15 2 పుష్య 39-12 |
| | 21 | శ | చ 10-28 ఆశ్రే 37.14 దక్షిణాయన పుణ్యకాలః |
| | 22 | ఆ | పం 5-13 మఘ 31-25 |
| | 23 | సో | ష 1.1 ఏవ్యం 54 29 పూఫ 30 58 |
| | 24 | మం | అ 49-22 ఉఫ 27-5 |
| 1958 సం|| | 25 | బు | న 43.15 హస్త 22.58 |
| | 26 | గు | ద 36-44 చిత్త 18 36 మహాలక్ష్మీవ్రతారంభం |
| | 27 | శు | ఏ 30-12 స్వాతి 14.37 |
| | 28 | శ | ద్వా 25 39 విశా 11.12 |
| | 29 | ఆ | త్ర 20.43 అనూ 8.12 తిథిద్వయం |
| | 30 | సో | చతు 16.38 జ్యే 6-8 శ్రీరంగక్షేత్ర జ్యేష్ఠాభిషేకః |
| | 1 | మం | ○ పౌ 13 36 మూల 4.39 |
| | 2 | బు | కృపా 11 2 పూషా 4-15 |
| | 3 | గు | ది 10 44 ఉషా 5.5 |
| | 4 | శు | త 11.13 శ్రవ 7-6 |
| జూలై నెల | 5 | శ | చ 13 0 ధ 10.26 |
| | 6 | ఆ | పం 15.56 శత 14 51 |
| | 7 | సో | ష 19-49 పూభా 20.17 |
| | 8 | మం | స 24-23 ఉభా 26.27 |
| | 9 | బు | అ 29-25 రేవ 32.58 |
| | 10 | గు | న 34-22 అశ్వ 39.18 |
| 1958 సం|| | 11 | శు | ద 38.53 భ 45.28 |
| | 12 | శ | ఏ 43 46 కృ 50-42 |
| | 13 | ఆ | ద్వా 45.12 రోహి 54.51 |
| | 14 | సో | త్ర 46-24 మృ 57-42 |
| | 15 | మం | చతు 46-35 ఆర్ద్ర 59-36 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

భారత ప్రశస్తి

THE PRIDE of INDIA




# LODHRA

FOR LADIES' HEALTH

**KESARI KUTEERAM Private LTD.**
MADRAS-14.

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

Lodhra Press, Madras-14.